# జ్ఞాన పథం

బ్రహ్మర్షి సుభాష్ పత్రి




ధ్యాన లహరి పబ్లికేషన్స్

GNĀNA PATHAM (Telugu)
*Brahmasri Subhash Patri*

Published by :
**D. SIVA PRASAD**
Dhyana Lahari Publications
525, Reddy & Reddy Colony
Tirupathi, Ph : 98481 52629.

First Edition : June, 2002.
Copies : 1000

Cover & Layout : CHALAM
Vijayawada – 520 002.

DTP : SADGURU GRAPHICS
Phone : 659070

Printed at : **OM ART PRINT**
Besant Road,
Vijayawada.
Phone : 577684

Copies availabe at :
**ALL PYRAMID DHYANA KENDRAS, A.P.**
**ALL BRANCHES OF VISALANDHARA BOOK HOUSE**
525, Reddy & Reddy Colony
Tirupati

Price : Rs. **70/–**

# లోపల ....

# "జ్ఞాన పథం !"

అన్ని చోట్లా 'దుఃఖం' విస్తరించి వుంది - ఇది మొదటి సత్యం!

దుఃఖం కేవలం తృష్ణ వల్లనే సంభవం!

దుఃఖం అన్నది 'తృష్ణ' వలన - ఇది రెండవ సత్యం!

'తృష్ణ' అంటే విచక్షణా రహితమ్మైన మోహం!

'తృష్ణ' అంటే అవసరాలకు మించిన కోరికలు !

'తృష్ణ అంటే మితిమీరిన ఆశ!

'తృష్ణ' అన్నది 'ఆశ' యొక్క విశ్వరూపం!

'తృష్ణ' అన్నది అవిద్య జనితం - ఇది మూడవ సత్యం!

ఆధ్యాత్మిక విద్య లేమినే 'అవిద్య' అంటాం!

'అవిద్య' అన్నది అష్టాంగ మార్గం ద్వారానే పోగొట్టబడుతుంది; ఇది నాల్గవ సత్యం!

'అష్టాంగ మార్గం' అంటే సరైన దృక్పథాలు, సరైన కోరికలు, సరైన వాక్కు, సరైన జీవన భృతి, సరైన వ్యవహార శైలి, సరైన శ్రద్ధ, సరైన ఏకాగ్రత, చివరగా సరైన ధ్యానంలతో కూడుకున్న పూర్తి శాస్త్రీయ ఆధ్యాత్మిక సాధనా విధానం.

ప్రకృతి అన్నది ఎప్పుడూ సదా, విరాజిల్లి వుండేది ; అయినా నిరంతరం, తన భంగిమలను మారుస్తూనే వుండేది; మనం నిత్యం క్షణ క్షణం మారుతూ వున్న ప్రకృతిలో జీవిస్తూ వుంటాం-

కనుక, 'మన చుట్టూ వున్నదంతా మార్పే !' అన్న ఈ సత్యాన్ని నిత్యమూ మరుపు లేకుండా ఎరుకలో వుంచుకోవడమే 'జ్ఞానపథం'లో పయనించడం అంటే!

అదే విధంగా, ప్రతి ప్రాణిలో వుండే 'నేను' అన్నది ప్రకృతిలో భాగమే!

'నేను' అనేది 'నిరంతరం మారే క్షణిక భావనల సమూహమే!'

వాస్తవానికి 'నేను' అన్నది ఏ ప్రత్యేక అస్తికత లేని వస్తువని తెలుసుకోవడమే- ఆ సత్యంలో నిత్యం, అనుక్షణం జీవించడమే - 'జ్ఞానపథం'లో వుండడం అంటే!

ప్రతి కార్యకలాపం లోనూ 'మధ్యేమార్గం'లో వుండడమే 'బుద్ధపథం'లో జీవించడం అంటే!

వాస్తవానికి శారీరక హింసే వున్న ఒక్కగానొక్క నిజమైన హింస - అందుకే, 'అహింసో పరమో ధర్మః' ; ఎందుకంటే మానసిక హింస అన్నది అవతలి వాళ్ళు మానసికంగా ఒప్పుకుంటేనే జరిగేది.

అహింసలో సదా జీవించడమే 'బుద్ధపథం'లో జీవించడం అంటే!

ప్రతి కర్మకూ తదనుగుణమైన 'ప్రతికర్మ' వుంటుంది - ఇదే 'కర్మ సిద్ధాంతం' అంటే - ఈ సత్యాన్ని సదా, ఎల్లప్పుడూ, పూర్ణ స్పృహలో వుంచుకోవడమే జ్ఞానపథంలో జీవించడంఅంటే!

నిరంతరం, అన్నింటినీ,అందరి దగ్గరి నుంచీ నేర్చుకుంటూ వుండటమే 'ప్రజ్ఞ' అంటే!

ప్రజ్ఞాపథమే 'జ్ఞానపథం'!

నిరంతరం, అన్నింటినీ, అందరికీ నేర్పిస్తూ వుండడమే 'కరుణ' అంటే!

కరుణాపథమే 'జ్ఞానపథం'!

సకల ప్రాణికోటితోనూ సదా మైత్రీ భావం కలిగి వుండాలి!

మైత్రీపథమే జ్ఞానపథం !

గౌతమ బుద్ధుడు ఓ అసామాన్య సత్య పరిశోధకుడు!

గౌతమ బుద్ధుడు ఓ అసామాన్య ధ్యాన యోగ పరిసాధకుడు!

గౌతమ బుద్ధుడు ఓ అసామాన్య కర్మసిద్ధాంత జ్ఞాన పరిబోధకుడు!

గౌతమ బుద్ధుడు అసామాన్య ధ్యాన, జ్ఞాన పరిప్రచారకుడు!

'జ్ఞానపథం'లో ప్రవేశించకోరే వారందరూ అదేవిధంగా సత్య పరిశోధకులు కావాలి!

'జ్ఞానపథం'లో ప్రవేశించకోరే వారందరూ అదేవిధంగా ధ్యానయోగ పరిసాధకులు కావాలి !

'జ్ఞానపథం'లో ప్రవేశించకోరే వారందరూ అదేవిధంగా కర్మసిద్ధాంత జ్ఞాన పరిబోధకులు కావాలి!

జ్ఞానపథంలో ప్రవేశించకోరే వారందరూ అదేవిధంగా ధ్యాన, జ్ఞాన పరి ప్రచారకులు కావాలి !

ఇది 'జ్ఞానపథం లో ప్రయాణించడం' అంటే!

పిరమిడ్ మాస్టర్స్ అందరూ జ్ఞానపథగాములు!

అనేక పిరమిడ్ మ్యాగజైన్స్‌లలో ఇచ్చిన సందేశాల సమూహమే ఈ జ్ఞానపథం!

జ్ఞాన పథాభిలాషులందరికీ ఈ 'జ్ఞానపథం' అన్న పుస్తక చక్కటి స్ఫూర్తి నిస్తుంది.

ధ్యానం శరణం గచ్ఛామి !

అధ్యాత్మిక ధర్మం శరణం గచ్ఛామి !!

సజ్జన సంఘం శరణం గచ్ఛామి !!!

# "నిరంతర ధ్యాన సాధన"

ప్రపంచంలో ప్రజలు రెండు రకాలుగా వున్నారు.

1. నాస్తికులు,

2. ఆస్తికులు.

"ఈ కళ్ళకు కనబడేదే 'సత్యం' ; ఈ కళ్ళకు కనపడని దానికి ఉనికే లేదు" అన్నదే నాస్తికత్వం!

"భౌతిక చక్షువులకు ఎంత మాత్రం అందనివీ, మరి దివ్యచక్షువు తోనే ప్రస్ఫుటమయ్యేవీ, వున్నాయి" అని చెప్పేదే ఆస్తికత్వం!

దివ్యచక్షువుతో ప్రస్ఫుటమయ్యే ఆత్మ పదార్థమే సకల భౌతికతకూ మూలాధార మనేదే 'మూల ఆస్తిక సిద్ధాంతం'.

సృష్టిలో అనాది నుంచీ నాస్తికతకూ, ఆస్తికతకూ ఘర్షణ జరుగుతూనే వుంది.

నాస్తికులు దుఃఖభాజనమైన జీవనం గడుపుతూనే వున్నారు ; ఆస్తికులు ఆనంద డోలికల్లో జీవనం గడుపుతూ నిత్యప్రగతిని సాధిస్తూనే వున్నారు.

సర్వ దేశ కాల పరిస్థితులలోనూ మహాత్ములు స్వచ్ఛమైన ఆస్తికతను ప్రబోధించడానికి అవతరిస్తూనే వున్నారు.

అలాంటి మహాత్ములలో నేటి సత్యసాయి అగ్రగణ్యులు ! నాస్తిక మూర్ఖులను ఆస్తిక విజ్ఞులుగా తయారు చేయడమే వారి జన్మధ్యేయం!

నాస్తికతే సర్వ రోగాలకూ, సర్వ ఆందోళనలకూ, సర్వ వెతలకూ, సర్వ భయాలకూ, సర్వ యుద్ధాలకూ మూల కారణం. స్వచ్ఛమైన ఆస్తికతే సకల ఆరోగ్యాలకూ, సకల సౌభాగ్యాలకూ, సకల సిద్ధులకూ మూల బీజం.

ప్రపంచ వ్యాప్తంగా లక్షలాదిగా శ్రీ సత్యసాయి గారి త్యాగమయ జీవితం ద్వారా మూర్ఖ నాస్తికత్వం నుంచి స్వచ్ఛమైన ఆస్తికత వైపు మరల్చబడ్డారు-మరల్చబడుతున్నారు. శ్రీ సత్యసాయి గ్రాండ్ మాస్టర్ గారికి "పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీల" ధ్యానులందరి తరఫున మరి నా తరఫున వినమ్ర నమస్సుమాంజలులు.

అయితే, స్వచ్ఛమైన ఆస్తికత నుంచి యింకా, యింకా ముందుకు మనం పురోగమించవలసింది వున్నది. అదే మన 'స్వంత సిద్ధత్వం' వైపు . . . . మన 'స్వంత బుద్ధత్వం' వైపు!

శ్రీ సత్యసాయి చూపించిన మార్గంలో మనం పయనిస్తూ అంతటి త్యాగ పురుషులంగా మనమూ అవ్వాలి! అప్పుడే వారికి మనశ్శాంతి.

అలాగే "గౌతమ బుద్ధుడు" లాంటి వారు చూపిన మార్గంలో మనం కూడా పయనిస్తూ క్రమక్రమంగా అన్నీ సాధిస్తూ మనం కూడా మన సొంత సిద్ధత్వాన్ని, బుద్ధత్వాన్ని సంపాదించుకోవాలి. ఇదే ఆ యొక్క గ్రాండ్ మాస్టర్స్‌కి ప్రియతమమయినది. అదే వారు మన నుంచి కోరుకునేది!

✧ 'సిద్ధత్వం' అనేది నిరంతర ధ్యాన సాధన ద్వారానే సాధ్యం.

✧ 'ధ్యాన సాధన' అంటే "ఆనాపానసతి-విపస్సన" సాధన మాత్రమే !

అలాగే, నిరంతర జ్ఞాన, ధ్యాన బోధనల ద్వారానే మనం బుద్ధులమయ్యేది.

ప్రథమ పక్షంగా నాస్తికులు ఆస్తికులు కావాలి; అంతిమ పక్షంగా ఆస్తికులు ఆధ్యాత్మిక శాస్త్రజ్ఞులుగా ఎదగాలి!

"ధ్యానం వల్లనే జ్ఞానం - జ్ఞానం వల్లనే ముక్తి!"



# "శ్రీ రమణ మహర్షి"

భారతదేశ ఆధ్యాత్మిక ముద్దుబిడ్డలలో అగ్రగణ్యుడు రమణ మహర్షి.

పసితనంలోనే జ్ఞానోదయం అయినవాడు.

చిన్నతనంలోనే బంధ విముక్తుడు కావడానికి ఉర్రూతలూగినవాడు!

జీవితంలో ఒక్క పలుకు కూడా వృధా పరచలేదు ఈ మహర్షి!

ఆత్మనిష్టలో, బ్రహ్మనిష్టలో ప్రతి క్షణం జీవించినవాడు!

"నేనెవరు?" అనే మహాప్రశ్న యొక్క విచారణకూ, ఆ మహాప్రశ్న యొక్క నిరంతర విశ్లేషణకూ అవతారరూపుడైనవారే రమణ మహర్షి.

తానెవరో తాను తెలుసుకుని జీవించే జీవితమే దివ్య జీవితం.

తానెవరో తనకు తెలియకుండా జీవించే జీవితం అడుగడుగునా భయాందోళనలమయం.

పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీల ధ్యానులందరూ తమను తాము ఎరిగినవారు! ఆ విధంగా దివ్యజీవితాన్ని అనుక్షణం అనుభవిస్తున్నారు!

'నేను'ను తెలుసుకోవాలంటే చిత్తం పూర్తిగా వృత్తిశూన్యం అవ్వాలి. అప్పుడొక కొత్త 'నేను' ఆవిర్భవిస్తుంది. అది 'విశ్వమంతా తానే అయివున్న నేను', 'సృష్టి అంతా తానే అయి వున్న నేను' 'సృష్టి అంతా తానే అయి వున్న నేను' ఏదయితే ప్రథమ సృష్టికర్తో అదే తాను అయి వున్న 'నేను'.

ఏదైతే రమణ మహర్షి గారికి సుసాధ్యమో అది అందరికీ సుసాధ్యం.

ఆధ్యాత్మిక సూత్రాలు అన్ని దేశాల లోనూ, అన్ని కాలాల లోనూ, అన్ని ప్రదేశాల లోనూ అన్ని వర్ణకులాల, అందరి వ్యక్తులకూ సరిసమానంగా వుంటాయి.

పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ వారు ఆ మౌలిక ఆధ్యాత్మిక సూత్రాలను సంపూర్ణంగా అవగాహన చేసుకున్నవారు. అవగాహన చేసుకుని ఆ సూత్రాలను అనునిత్యం అందరికీ బోధిస్తున్నవారు.

ప్రతి మనిషీ 'మహర్షి' కావాలి! 'మహర్షి' అంటే 'మహా ఋషి' అంటే 'గొప్ప ద్రష్ట' అంటే 'గొప్ప మూడో కన్ను గలిగివున్నవాడు'. ప్రతి మనిషీ 'బ్రహ్మర్షి ' కావాలి. 'బ్రహ్మర్షి' అంటే సృష్టి రచన అంతా తెలుసుకున్నవాడు. అందరూ మహర్షులుగా, బ్రహ్మర్షులుగా కావాలని నేను వాంఛిస్తున్నాను.

అందుకు " ఆనాపానసతి - విపస్సన ధ్యాన విధానం ఒక్కటే మార్గం" అని మళ్ళీ మళ్ళీ 'లక్షల సార్లు బల్ల గ్రుద్ది చెప్తున్నాను.

# "ధ్యానవరం"

'ధ్యానం' అన్నది మానవుని పునీతుణ్ణి చేసే వున్న ఒక్కగా నొక్క ప్రక్రియ: ధ్యానం మానవుని దివ్య మనస్కుని గా రూపొందిస్తుంది.

ధ్యానం వలన ఆధ్యాత్మిక సంపద కలుగుతుంది. ధ్యానం వలన సుఖం, ఆనందం, బ్రహ్మానందం కలుగుతాయి.

ధ్యానికి ఏమీ లేకున్నా అన్నీ ఉన్నట్లే. ధ్యాని నిత్య సుఖి. ధ్యానం అన్నది పూర్ణ కైవల్య సాధనామార్గం 'ధ్యానం చేయటం' అంటే పరమాత్మగా, పరమాత్మలో నిమగ్నుడై వుండటం అని భావం.

మనమందరం విశ్వశక్తి స్వరూపులమే! ధ్యానం వలన మనలోని విశ్వశక్తి ప్రచండంగా విజృంభిస్తుంది. కనుక, "ధ్యానం ఒక అద్భుతవరం" అనడం లో అతిశయోక్తి లేదు ! ఈ విషయం అందరికీ తెలియచేయాలన్న తపనే "పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ ఇండియా" రూపకల్పనకు ప్రధాన కారణం.

"ధ్యానమే అందం - జ్ఞానమే చందం!"

"ధ్యానమే జయం - జ్ఞానమే విజయం!"

"సంసారమే నిర్వాణం - నిర్వాణమే సంసారం!"

"దేహమే దేవాలయం - గృహమే ఆశ్రమం!"

" జీవుడే దేవుడు - దేవుడే జీవుడు!"

"నేనే మీరు - మీరే నేను !" "నేనే అంతా - అంతా నేనే !"

"ఇక్కడ వున్నట్లే పైన వుంది - పైన వున్నట్లే ఇక్కడ వుంది !"

" ఈ మతంలో వున్నదే ఆ మతం లో వుంది !"

"ఆ మతం లో ఉన్నదే ఈ మతం లో వుంది!"

"నేను' మరణిస్తేనే జీవితం - నేను' జీవిస్తే మరణం!"

" 'నాది' అనుకుంటే నాది అంతా పోతుంది!"

" 'నాది' లేకపోతే వున్నదంతా నాదే !"

ఇంతే ! ఇంతే ! ఇంతే!

## "ధ్యానాన్ జ్ఞానః - జ్ఞానాన్ ముక్తిః !"

"జ్ఞానాన్ ముక్తిః"

అన్నది కపిల మహాముని విరచిత సాంఖ్య సూత్రం.

ఆత్మజ్ఞానం వినా దుఃఖం నుంచి ముక్తి అసంభవం.

కానీ, ధ్యానం వినా ఆత్మజ్ఞానం అసంభవం.

కనుకనే, "ధ్యానాన్ జ్ఞానః" అని మౌలికంగా మనం చెప్పుకుని తీరాలి.

"ధ్యానం వల్లనే జ్ఞానం, జ్ఞానం వల్లనే ముక్తి !"

" ధ్యానం" అంటే ముందుగా "చిత్త వృత్తి నిరోధం".

తరువాత, పరంపరగా, "దివ్యచక్షువు ఉత్తేజితం".

"ధ్యానం" అన్నది "శ్వాస మీద ధ్యాస" వల్లనే సాధ్యం.

ఇక మీ ఇష్టం ! బంగారు పంటలను పండించుకోండి!



# "ధ్యానాలయాలు"

'ఆది శంకరాచార్యుల' వారు అన్నారు - "దేహో దేవాలయో ప్రోక్త; జీవోద్దేవో సనాతనః" అంటే,

"దేహమే దేవాలయం ; జీవుడే సనాతనమైన దైవం" అని అర్థం.

'దేహం' కాని 'దేవాలయం' లేదు! జీవుడు' కాని దేవుడే లేడు"!

దేహం లోనే ధ్యానం చేయాలి! 'దేహం' ఉన్నదే ధ్యానం చేయడం కోసం! దేహం లేకపోతే ఎక్కడి ధ్యానం?

దేహం నశించిన తర్వాత, జీవుడు పై లోకాలకు వెళ్ళిపోయిన తర్వాత, అక్కడ 'లబ లబ' కొట్టుకోవాలి!

అక్కడ 'దేహం లేదు' కనుక ధ్యానం చేయలేడు! అప్పుడు చేయగలిగింది మరో జన్మ కోసం నిరీక్షణ ఒక్కటే!

"దేహం ధ్యానం కోసమే" అని జ్ఞప్తికి తెచ్చుకుందాం !

"ధ్యానం వల్లనే జీవుడు దేవుడు అవుతాడు"

అని అర్థం చేసుకుందాం!

దేవాలయాన్నీ ధ్యానాలయాలుగా అవ్వాలి.

దేవాలయాలు పూజాలయాలుగా వున్నాయి ;

ప్రస్తుతం అవి పూజారుల ఇళ్ళల్లో వున్నాయి ;

ప్రస్తుతం అవి 'అమ్మలక్కల కబుర్లాలయాల్లా వున్నాయి ;

దేవాలయాలన్నీ ధ్యానకేంద్రాలుగా మారాలి !

దేవాలయాలన్నీ ఆత్మజ్ఞాన కేంద్రాలుగా అవ్వాలి !

# "ధ్యాన జ్యోతి !"

"ధ్యాన జ్యోతి" ద్వారానే "ఆత్మజ్యోతి" వెలిగేది!

"ఆత్మ జ్యోతి" ద్వారానే "జ్ఞాన జ్యోతి" వెలగగలిగేది !

"జ్ఞాన జ్యోతి" ద్వారానే "ధర్మ జ్యోతి వెలిగేది!

"ధర్మ జ్యోతి " ద్వారానే "సుకర్మ జ్యోతి" వెలిగేది!

"సుకర్మ జ్యోతి" ద్వారానే "ఆరోగ్య, ఆనంద జ్యోతులు" వెలిగేది!

"సుకర్మ జ్యోతి" ద్వారానే "నిత్య ప్రగతి " జ్యోతి వెలిగేది!

అనింటికీ మూలం ధ్యానం!

కనుకనే, ముందుగా "ధ్యాన జ్యోతి" ని వెలిగించాలి!

"ధ్యాన జ్యోతి " ని ప్రతిరోజూ వెలిగిస్తూనే వుండాలి!

"ఆనాపానసతి" తోనే పారంభమవుతుంది "ధ్యాన జ్యోతి"-

అది "విపస్సన" లో జ్వాజల్యమానం గా విజృంభిస్తుంది.

అది అన్నింటికీ మూలం ధ్యానం!

జీవితంలో ఉల్లాసానికీ, ఉత్సాహానికీ మూలం ధ్యానం!

సకల ప్రాణికోటి సౌభ్రాతృతకూ మూలం ధ్యానం!

సకల మత సామరస్యానికీ మూలం ధ్యానం!

సకల కళాకోవిదుడు కావడానికి మూలం ధ్యానం!

కనుక, వెలిగిద్దాం "ధ్యాన జ్యోతి"ని !

సదా వెలిగిస్తూనే వుందాం "ధ్యానజ్యోతి" ని-

సదా మనలో, మరి అందరిలో !

"దేవాలయాల్లో విగ్రహం ముందర హారతి కర్పూరాన్ని వెలిగిస్తాం" అంటే అర్థం ఏమిటి ?" దేహో దేవాలయో ప్రోక్తః - జీవోద్దేవో సనాతనః!" అన్నారు శంకరాచార్యులు.

దేహమే దేవాలయమన్నమాట.

దేవాలయంలో ప్రతిష్టింపబడ్డ విగ్రహాన్ని 'దేవుడ'ని అంటున్నాం.

అంటే దేహాలలో ప్రతిష్టింపబడ్డ జీవుడే దేవుడని అర్థం చేసుకోవాలి.

ఈ 'దేహ' మనే దేవాలయంలో 'మనస్సు' అనే 'కర్పూరాన్ని కరిగించి 'బుద్ధి' అనే 'జ్యోతి' ని వెలిగించాలి, ఆ యొక్క వెలుతురులోనే 'ఆత్మ' తనను తాను తెలుసుకునేది.

దేహంలో ఉన్న 'అంధకారాన్ని' తొలగించాలి.

దేహంలో ఉన్న 'అంధకారం' అంటే దేహంలో ఉన్న 'మలినం' అంటే 'పూర్వ జన్మ కృత పాప ఫలితం',

ప్రతి ఇంటిలోనూ వెలగాలి "ధ్యాన జ్యోతి!"

ప్రతి వ్యక్తిలోనూ వెలగాలి "ధ్యాన జ్యోతి!"

'నిత్యరోగి' అయినవాడు నిత్య భోగి'గా విలసిల్లాలంటే నిత్యమూ వెలగాలి "ధ్యానజ్యోతి"!



# "సంకల్ప బలం !"

బలం వున్నవాడు "బలవంతుడు".

బలం లేనివాడు "బలహీనుడు"?

బలవంతులెప్పుడూ నాయకులే

బలహీనులెప్పుడూ అనుయాయులే!

బలం అన్నది రెండు రకాలు - ఒకటి 'పశు బలం' రెండు ' సంకల్ప బలం'

పశు బలం తిండితో వచ్చేది ; సంకల్ప బలం జ్ఞాన శుద్ధత తో వచ్చేది.

పశు బలం అన్నది ఎప్పుడూ సంకల్ప బలం ముందు దిగదుడుపే !

మనం అనుకున్నవన్నీ సాధించాలంటే సంకల్ప బలం అనివార్యం.

సంకల్ప బలం సమృద్ధిగా ఉండాలంటే ఎప్పుడూ 'సంకల్పాలే' ఉండాలి కానీ 'వికల్పాలు' ఉండకూడదు !

'వికల్పం' అంటే అనుమానం ; 'వికల్పం' అంటే అసందిగ్ధత.'

మన సంకల్ప బలం పెరగాలంటే మనకన్నా ఎక్కువ సంకల్ప బలం ఉన్నవారితో సాంగత్యం పెరగాలి.

సంకల్ప బలం పెరగాలంటే 'సంకల్ప బలం' అనే అంశాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేయాలి! దాని తీరు తెన్నులను ఆకళింపు చేసుకోవాలి ! దైనందిన జీవితంలో అనేకానేక ప్రయోగాలు చేసి అనుభవాన్ని సంపాదించుకోవాలి.

చిన్ని చిన్ని ప్రయోగాలతో మెదలు పెట్టి అచిర కాలంలో పెద్ద పెద్ద ప్రయోగాలకు పూనుకోవాలి.

ప్రతిరోజూ 'ఆనాపానసతి అభ్యాసం' ద్వారా మన సంకల్పాలకు శక్తిని సంపాదించుకోవాలి.

పిల్లలకు చిన్నప్పటి నుంచే సంకల్ప బలాన్ని ప్రభోధించాలి ; వృద్ధులకు గుర్తు చేయాలి.

అనారోగ్యాలనన్నింటినీ సంకల్ప బలంతో పోగొట్టుకోవాలి - అదే సరైన చికిత్సా విధానం! సంసారంలో ఒడుదుడుకులనూ సంకల్ప బలంతో ఎదుర్కోవాలి.

నిర్వాణ - పథంలో అవరోధాలను సంకల్ప బలం తో త్రోసిపారేయాలి.

'సంకల్ప బలం' జిందాబాద్ !

# "రెండు ఉన్నాయి !"

'రెండు' ఉన్నాయి!

ఒకటి మనకు తెలిసినది ; రెండవది మనకు తెలియనది.

ఒకటి పంచ జ్ఞానేంద్రియ సహితమైనది ;

రెండవది పంచ జ్ఞానేంద్రియాతీతమైనది.

రెండు ఉన్నాయి - ఒకటి ప్రపంచం; రెండు బ్రహ్మాండం.

మొదటిది పంచ జ్ఞానేంద్రియాలతో గ్రాహ్యం ; రెండవది జ్ఞానేంద్రియా తీతం తో గ్రాహ్యం -

అంటే, 'దివ్యచక్షువుతో' మాత్రమే పొందగలిగేది.

రెండు వున్నాయి! మొదటిది ప్రాపంచికత ; రెండవది ఆధ్యాత్మికత.

ప్రాపంచికత భౌతిక కాయానికి సంబంధించినది ;

ఆధ్యాత్మికత ఆతకు సంబంధించినది.

'రెండు' ఉన్నాయి! ఒకటి సంసారం; రెండు నిర్వాణం

'సంసారం' అనేది ప్రకృతితో సంపర్కం; 'నిర్వాణం' కేవల పురుష అనుభవ సారం.

'రెండు' ఉన్నాయి! కనుక మనిషి రెండింటినీ పొందాలి ;

ఏ ఒక్కదాని వెంటే వుండకూడదు ; రెండూ సమగ్రంగా ఉంటేనే పరిపూర్ణత!

'రెండు' ఉన్నాయి! ఒకటి ధర్మం, రెండు ధ్యానం.

'ధర్మం' చక్కటి ప్రాపంచికతను సాధింపజేస్తుంది ;

'ధర్మం' చక్కటి సంసారాన్ని ప్రసాదిస్తుంది.

అలాగే, ధ్యానం చక్కటి ఆధ్యాత్మికను సాధింపజేస్తుంది.

ధ్యానం 'కేవల' అనుభూతిని కలుగజేస్తుంది.

'రెండు' ఉన్నాయి! కనుక, రెండింటి లోనూ నిష్ణాతులమవ్వాలి -

ధర్మానుష్ఠానం ద్వారా సంసారం లోనూ,

మరి ధ్యానానుష్ఠానం ద్వారా నిర్వాణం లోనూ !

# "ధ్యాన మధనం !"

ధ్యానం ఒక అనంత యానం.

'ధ్యానం'సాటిలేని'ధనం'

'జ్ఞానం' అన్నది 'ధ్యానం' యొక్క వరప్రసాదం.

జ్ఞాన సముపార్జనకు తప్పదు మరి నిరంతర 'ధ్యానసాధన'

'మధనం ఒక్కటే మరి 'చిలకడం' ! 'చిలకడం' అంటే 'నిరంతర సాధన' !

ధ్యాన మధనమే 'జ్ఞానమధనం'!

ధ్యాన మధనమే జ్ఞాని యొక్క జీవితగమనం.

ధ్యాన మధనమే అందరి జీవితగమ్యం.

మరి అందరం'ధ్యానం చేద్దాం, సరియైన జ్ఞానాన్ని పొందుదాం.

మరి అందరం నిరంతర ధ్యాన మధనం చేద్దాం !

'ధ్యాన మధనం'లోని 'జ్ఞాన మధనం' ద్వారా -

ఈ జన్మనే కడజన్మ గా మలుచుకుందాం!



# "అంతర్ జీవితం!"

రెండు రకాల జీవితాలు ఉన్నాయి.

ఒకటి'బాహ్య జీవితం',రెండు 'అంతర్ జీవితం'.

"బాహ్య జీవితం గురించి నాకు అంతా తెలుసు" అని అనుకుంటారు-అలాగే " 'అంతర్ జీవితం' అనేది లేనేలేదు" అని అనుకుంటారు.

అయితే, వాస్తవానికి 'అంతర్ జీవితమే' బాహ్యజీవితానికి పరిపూర్ణతనిచ్చేది !

అంతర్ జీవితమే బాహ్యజీవితానికి పరిపుష్ఠిని ప్రసాదించేది !

అంతర్ జీవిత రహిత బాహ్య జీవితం ఇసుక పర్ర మీద కట్టిన కట్టడం !

అంతర్ జీవితం వినా బాహ్య జీవితం అన్నది గాలిలో మేడలు కట్టడం లాంటిది.

అంతర్ జీవిత సహిత బాహ్యజీవితం అన్నది పునాదుల మీద కట్టబడిన రాజసౌధం.

అంతర్ జీవితమే బాహ్య జీవితాన్ని పూర్తిగా తెలియజేయగలిగేది.

అంతర్ జీవితం అన్నది 'ఆత్మజ్ఞానమయం-ఆత్మానుభవమయం'.

బహిర్ జీవితం అందరికీ కనపడేది అన్నది అంతర్ జీవితం ఎవరికీ కనపడనిది.

బహిర్ జీవితం అందరికీ చూపించగలిగినది.

అంతర్ జీవితం ఎవరికీ చూపించలేనిది.

అంతరంగ జీవితం ద్వారా బహిరంగ జీవితం అర్థవంతమవుతుంది;
తేజోవంతమౌతుంది; ధర్మార్థ కామమోక్షదాయకం అవుతుంది.

'అంతర్ జీవితం' అన్నది సజ్జన సాంగత్యం ద్వారా మొట్టమొదటిసారిగా పరిచయం అవుతుంది.

తర్వాత నిరంతర ధ్యాన, స్వాధ్యాయ అభ్యాసాల ద్వారా సువిదితమౌతుంది.

## "తగినంత లాభాలనే దృష్టిలో పెట్టుకోవాలి!"

వ్యాపారులు, వ్యవసాయకులు, పారిశ్రామికవేత్తలు, శ్రామికులు, గృహస్థులు, పాలకులు, బోధకులు - వీరందరితో కూడి ఉన్నదే 'సమాజం'.

మానవ శరీరంలో కళ్ళు, చెవులు, చేతులు, కాళ్ళు- ఇలా ఏ అంగం చేసే పని అది చేయాలి. ప్రతి అంగానికీ సరిసమానమైన విశిష్టత, సరిసమానమైన బాధ్యత, సరిసమాన దైవత్వం ఉన్నాయి. శరీరంలో ఏదో ఒక భాగం లేదా ఏదో ఒక అంగం 'ప్రధానమైనది' మిగిలినవి 'అప్రధానమైనవి' కావు!

వ్యాపార దక్షత ఉన్నవారు వ్యాపారం చేయాలి; వ్యవసాయ దక్షత ఉన్నవారు వ్యవసాయం చేయాలి; పై దక్షత లేనివాళ్ళు శారీరక శ్రమలో అయినా దక్షతను చూపించాలి.

వ్యాపారులు మొట్ట మొదటగా గుర్తుంచుకోవాల్సింది ఏమిటంటే "సమాజానికి వారి వ్యాపారం అతి ముఖ్యమైనది" అని ! వ్యాపార వృత్తిలో ఉన్నవారు మొదట 'వ్యాపార దక్షత'ను పెంచుకోవాలి. న్యాయంగా వ్యాపారం చెయ్యాలి. కుటుంబ శ్రేయస్సుకు తగినంత లాభాలనే దృష్టిలో పెట్టుకోవాలి. అంతకుమించి వచ్చిన లాభాలను సంఘ శ్రేయస్సుకు వినియోగించాలి.

'వ్యాపార దక్షత' అనేది ఒక శాస్త్రం! దీన్నే ఇంగ్లీషులో 'Business Management" అంటాం. దీనికి ప్రత్యేకంగా ప్రపంచమంతటా కళాశాలలు ఉన్నాయి. కనుక, వ్యాపారం చేసే వాళ్ళు వ్యాపార దక్షతను సంపాదించుకోవాలంటే 'Business Management' లాంటి కోర్సుల ద్వారా వ్యాపార దక్షతను సంపాదించుకోవాలి. అందులోని సూత్రాలను అవగాహన చేసుకోవాలి. తోటి వ్యాపారులతో నిరంతరం వ్యాపార విషయాలను పరస్పరం చర్చిస్తూ, పరస్పరం నేర్చుకుంటూ ఉండాలి. చేపట్టిన వృత్తికి 'తగిన సజ్జన సాంగత్యం' 'తగిన స్వాధ్యాయం' చేయాలి. స్వంత వ్యాపారం మీద పూర్తి ధ్యాస ఉంచాలి.

అదే విధంగా పాలకులు అయినవారు 'పాలనా దక్షత' ను కలిగి ఉండాలి;
వ్యవసాయదారులు 'వ్యవసాయ దక్షత' ను కలిగి ఉండాలి.

గృహస్తులు అయినవారు 'గృహ నిర్వహణా దక్షత' ను కలిగి ఉండాలి.

శ్రామికులు 'శ్రామిక దక్షత' ను కలిగి ఉండాలి. ఇవన్నీ సెరసి 'వృత్తి దక్షత' అనబడతాయి అయితే ఎవరి వృత్తి దక్షతను వారు చూసుకుంటూనే మరి అందరూ ఆత్మాజ్ఞాన పరాయణులు కూడా కావాలి. అది 'compulsory' అంటే 'తప్పనిసరి' అంటే, ఒక త్రాటి మీద 'వృత్తి దక్షత' వారి మరొక త్రాటి మీద 'ఆత్మజ్ఞాన దక్షత'ను కలిగి ఉండాలి.



# "లోబ్‌సాంగ్ రాంపా!"

"లోబ్‌సాంగ్ రాంపా!"

ఆ పేరు వింటేనే నా వొళ్ళు పులకరిస్తోంది!

నా మొట్టమొదటి ప్రియతమ, ఆధ్యాత్మిక గురువు డా॥ లోబ్‌సాంగ్ రాంపా!

అది 1979 డిసెంబర్ 29!

నేను తిరుపతి నుంచి కర్నూలు వస్తూ మధ్యలో నా సహోద్యోగి అయిన శ్రీ రామ చెన్నారెడ్డి గారితో కొంతసేపు గడపడానికి నంద్యాలలో దిగాను.

ఈ జీవితంలో మొట్టమొదటసారిగా 1976లో నాకు 'ధ్యానం' గురించి పరిచయభాగ్యం కల్గించినవారు శ్రీ రామచెన్నారెడ్డి గారు!

అప్పుడు వారి ఇంటిలో నేను రెండు పుస్తకాలు చూశాను.

అవి ఒకటి లోబ్‌సాంగ్ రాంపా గారు వ్రాసిన "యూ ఫారెవర్".

రెండవది పాల్ బ్రంటన్ గారు వ్రాసిన "విజ్‌డమ్ అఫ్ ది ఓవర్‌సెల్ఫ్"

అయితే అంతఃస్ఫూర్తితో "యూ ఫారెవర్ " అనే పుస్తకాన్ని తీసుకున్నాను.

ఆ తర్వాతి రెండు రోజులూ కర్నూలులో ఆ పుస్తకాన్ని పూర్తిగా అధ్యయనం చేశాను.

ఆ పుస్తకం నాకు అన్ని విషయాల గురించీ సమగ్ర విజ్ఞానాన్ని కళ్ళు మూసుకుని తెరిచేంతలో ఇచ్చింది!

నా జీవితం ఆ పుస్తకం ద్వారా ఒక గొప్ప మలుపు తిరిగింది!

అన్ని సందేహాలూ తుడిచిపెట్టుకు పోయాయి!

క్షణంలో ఆధ్యాత్మిక శాస్త్ర ఆచార్యుడనయ్యాను!

ఆకస్మికంగా వైకుంఠ ద్వారాలు విశాలంగా తెరుచుకున్నాయి!

అప్పట్నుంచీ ప్రారంభమైంది నా ఆధ్యాత్మిక జీవితయాత్ర ... అంటే ఆధ్యాత్మిక శాస్త్రాన్ని విస్తృతంగా ప్రచారం చెయ్యడం! ఇలా ఈ ప్రయాణం ఎల్లప్పడు సాగుతూనే వుంటుంది ! ఇది ఇక ఎల్లప్పడూ వుంటుంది ... యుగ యుగాలకూ వుంటుంది!

# "ధ్యాన గోవిందం!"

'గో' అంటే ఇంద్రియాలు!

'గోపాలుడ'ంటే ఇంద్రియాలను తన ఆధీనంలో ఉంచుకున్నవాడు!

ఇంద్రియాలు ఆరు - బహిర్ముఖంగా అయిదు;

అంతర్ముఖం అయిన మనస్సు ఆరు.

ఆరు ఇంద్రియాలనూ ఆధీనంలో వుంచుకున్నవాడు 'గోపాలుడు'!

ఆత్మానుభవం ఉన్నవాడే 'గోపాలుడు' కాగలడు!

అప్పుడే ఇంద్రియాలన్నీ వశమై సుఖాన్నిచ్చేవి; శాంతినిచ్చేవి.

అంతవరకు 'అపరిమిత ధోరణి'లో వున్న ఇంద్రియాలు ఆత్మానుభవం తరువాత, ఆత్మ దీప్తి తరువాత, 'పరిమిత' మై భాసిస్తాయి!

ఇంద్రియ పరిమితత్వంలోనే పరమసుఖం, పరమశాంతి అన్నవి సంభవం!

ఆత్మానుభవం అన్నది - ఆత్మ దీప్తి అన్నది - కేవలం ధ్యానయోగం లోనే సంభవం!

"యోగ; చిత్త వృత్తి నిరోధః" అన్నారు పతంజలి.

అంటే "చిత్త వృత్తులు నిరోధించడమే యోగమవుతుంది" అని.

చిత్త వృత్తి నిరోధానికి ఏకైక మార్గం సుఖమయప్రాణాయామం - అథవా ఆనాపానసతి - అథవా 'శ్వాస మీద ధ్యాస'- అథవా పవనపుత్రులమవ్వడం - లేక మారుతీ పుత్రులవ్వడం - అంటే మన ప్రాణధారతో మనం ఏకం కావడం.

'గో' అంటే ఇంద్రియాలు ! 'గోవిందం' అంటే ఇంద్రియాలకూ, మరి ప్రకృతికీ అన్నింటికీ మూలమైన 'ఆత్మ పదార్థం'!

'గోవిందా!' 'గోవిందా!' - అని కేకలేస్తూంటారు; అంటే 'ఆత్మ' , 'ఆత్మ' అని గుర్తుతెచ్చుకోవడమే అన్నమాట! తిరుపతి వేంకటేశ్వరుణ్ణి 'గోవిందు'డంటూరు.

వేంకటేశ్వరుడు చేసింది ధ్యానం - ధ్యానం - ధ్యానం! ఆయన మనల నుంచి కోరేది ధ్యానం! ధ్యానులను తప్ప వేంకటేశ్వరస్వామి ఇతరులను ఇక సహించబోడు - తిరుపతిలో గానీ! మరి యావత్ ప్రపంచంలో గానీ! తలలు కాదు 'బోడు' లు - తలపులు కావాలి 'బోడు'లు! సమర్పించవలసింది 'తలనీలాలు' కాదు మనలోని 'తమో', 'రజో' దోషాలు!

శ్రీ వేంకటేశ్వరుడు సూచించిన మార్గాన్ని, జారీ చేసిన ఆజ్ఞలను, సదా అందరూ పాటించాలి.

# "1999 నూతన సంవత్సరం సందేశం!"

**1999!** ఆఖరి చీకటి సంవత్సరం!

ఎన్నో రోజుల నుంచీ ఎదురు చూస్తున్న సంవత్సరం మన ముంగిటకు వచ్చేసింది. భూమండలం ఇప్పటికే అనేకానేక వెలుగు యుగాలనూ, అనేకానేక చీకటి యుగాలనూ ఒక దాని తర్వాత ఒకటి పరంపరగా చూసినా, ఈ ప్రస్తుత చీకటి యుగాంతపు ఆఖరి సంవత్సరం మాత్రం ఒక ప్రత్యేకతను సంతరించుకుంటోంది! ఎందుకంటే, ఇక రాబోయే వెలుతురు యుగం శాశ్వతంగా భూమండలాన్ని అంటిపెట్టుకుని వుంటుంది! భూమండలం ఇంతవరకూ వున్న తన భౌతికతను కోల్పోబోతోందన్న మాట! 'ఇంటర్ - గెలాక్టిక్ ఫెడరేషన్ వాళ్ళు తీసుకున్న నిర్ణయం ఇది. ఇంక ఎప్పటికీ 'సుర' ప్రభావమే కానీ, 'అసుర' ప్రభావం భూమి మీద వుండదు!

31 - 12 - 1999 తేదీన భూమండలం పూర్తిగా "ఫోటాన్ బాండ్"లో ప్రవేశించ బోతోంది! ఆ రోజు భూమండలం సమస్తానికీ పర్వదినం !

1999 సం॥ యొక్క 365 రోజులూ "చిట్టచివరి గడ్డు రోజులు" - ఆధ్యాత్మికులకూ మరి అనాధ్యాత్మికులకూ !

ఆధ్యాత్మికులకు అనాధ్యాత్మికుల నుంచి పరీక్షలు ఈ సంవత్సరంలోని ఎక్కువ; అలాగే అనాధ్యాత్మికులకు తమ స్వంత అనాధ్యాత్మికత నుంచి పరీక్షలు ఎక్కువ!

1 - 12 - 2000 నుంచి భూమండలంలో స్వర్ణయుగానికి నాంది.

పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ మాస్టర్లు అందరూ ఇంకొక్క 365 రోజుల మటుకు కష్టపడాలి; విమర్శలను ఎదుర్కోవాలి; ఆ తరువాత అంతా మరి పూలబాటలే! పచ్చతోరణాలే!

కనుక, ఇంతవరకూ ఎంతో ధైర్యంగా అన్ని కష్టాలనూ, అన్ని విమర్శలనూ చక్కటి ఓర్పు తో, సహనం తో, అజ్ఞానులతో యుద్ధాలు చేసి చేసి అలసి వున్న "పిరమిడ్ వీరులు" ఇక "ఆఖరి పరీక్షా సంవత్సరం" లో ప్రవేశిస్తున్నారు! అయితే క్రొత్తగా చేసేది ఏమీ లేదు! ఇన్ని రోజులూ ఉన్నట్టే అదే అకుంఠిత దీక్ష తో, మరొక్క సంవత్సరం గడపాలి! ఆ తర్వాత జగత్ వ్యాపితంగా "ధ్యాన సామ్రాజ్యం" నెలకొల్పబడుతుంది!

మరొక్క సంవత్సరం మాత్రం అప్రమత్తంగా వుందాం! జాగరూకలుగా వుందాం! వీలైనంత ఎక్కువమందిని యధావిధిగా ధ్యానులుగా, జ్ఞానులుగా తీర్చిదిద్దుదాం!

# "ధ్యానకమలం!"

మనిషి జీవితం ఒక నదీ ప్రవాహం లాంటిది 'నది' అనేది ఎత్తైన కొండలలో పుడుతుంది- అనేకానేక వంకలు తిరుగుతూ పయనిస్తుంది ! దారిలో ఎన్నెన్ని అడ్డంకులో ! ఎన్నెన్ని అనుభవాలో !

ఒక్కోసారి జలపాతంగా 'ధభేల్ ' మని చతికలపడుతుంది; ఒక్కోసారి తీవ్రమైన వంకలతో చక చక సాగుతుంది. ఒక్కోచోట ప్రశాంతం గా. గంభీరంగా, మరో చోట మందంగా కదులుతూ వుంటుంది. చివరికి జరిగేది తన 'ప్రత్యేకత'ను కోల్పోవటం; చివరిగా పరిణమించేది అన్నిచోట్లా ఒకే విధంగా వుండే మహాసంద్రంలా.

మనిషి జీవితం కూడా కొండల ఎత్తుల్లో, అంటే పూర్ణాత్మల సంకల్పలోకాలలో ఆవిర్భవిస్తుంది. క్రింది లోకాలలో దింపబడిన జీవాత్మ తన నూతన శాశ్వత జీవితం యొక్క అనేకానేక జన్మల్లో అనేకానేక పాఠాలు నేర్చుకుంటూ,ప్రౌఢత్వం సంపాదించుకుంటూ వుంటుంది.

జీవాత్మ ప్రౌఢదశను దాటి వృద్ధ దశల్లో ఉన్నప్పడు, అంటే చివరి జన్మల్లో వున్నప్పడు, అంటే ప్రశాంతం గా, గంభీరం గా సాగుతున్నప్పడు, అద్భుతమైన 'ధ్యాన కమలాలు' వికసించి అందరినీ ఆకర్షిస్తాయి; ఆకట్టుకుంటాయి !

ఆ తరువాత ఓ పూర్ణాత్మ గా తానూ విశ్వాత్మ భాగమై పోతుంది. 'ధ్యాన కమలాలే' ధ్యానానుభవాలు ! 'ధ్యాన కమలా'లే యోగ సిద్ధులు ! 'ధ్యాన కమలా'లే సుజ్ఞాన వీచికలు! 'ధ్యాన కమలా'లే ఆత్మ సౌరభాలు !



# "వికసిత పుష్పాలుగా ఉండాలి!"

ఒక వృక్షం యొక్క పరిణామ క్రమంలో ముఖ్యంగా రెండు దశలుంటాయి.

ఒక దాన్ని 'వెజిటేటివ్ దశ' అంటాం. రెండవ దాన్ని 'ఫ్లావరింగ్ దశ' అంటాం. 'వెజిటేటివ్' దశ అంటే 'విత్తన స్థితి నుంచి వృక్షం తన పుష్ప దశ వరకు సంతరించుకునే స్థితి' అన్నమాట! 'ఫ్లావరింగ్ దశ' అంటే ఆ ఎదిగిన వృక్షం 'తన పుష్ప దశ వరకు ఇక అయి పోయింది గనుక ప్రతిసృష్టి కి, తన వంతు అయిన ప్రత్యేక సృష్టికి ఇంక పూనుకోవటం అన్నమాట!

ఇదే విధంగా ఒక అపరిపూర్ణుడైన మానవుడు పరిపూర్ణుడుగా అయ్యేంత వరకూ ఉంటే స్థితే ఆ మానవుడి జన్మ పరంపరలు 'వెజిటేటివ్ దశ'.

తాను పరిపూర్ణుడైన తర్వాత ఇక 'ప్రతిసృష్టి'కి పూనుకుంటూ, ఇతరులనూ పరిపూర్ణులుగా తయారు చేసేందుకు కృషి చేసేవారే. తమ జీవితంలో రెండవ దశను అంటే 'ఫ్లావరింగ్ దశ'ను అందుకునేవారు.

ప్రతి మనిషీ 'వికసిత పుష్పం'గా మారాలి!

అందరూ తాము సంపూర్ణతను సంపాదించుకోవటమే కాక వీలైనంత మందినీ పరిపూర్ణులుగా చేయ నిమగ్నులవ్వాలి.

'స్వంత ధ్యాన సాధన ద్వారా స్వంత పరిపూర్ణత్వాన్ని సాధించుకుని

ఆ తర్వాత 'నిరంతర ధ్యాన ప్రచారం' ద్వారా 'వికసిత పుష్పాలు"గా మారాలి.



# "ధ్యాన ఫలం!"

ప్రతి కార్యం వెనుకా ఒక నిర్దిష్టమైన కారణం వుంటుంది! - ఆ కార్యం ద్వారా ఏ లాభాన్ని మనం పొందగోరతామో, ఏ ప్రతిఫలాన్ని వాంఛిస్తామో, అదే ఆ కార్యానికి కారణభూతం అవుతుంది.

ప్రతి కార్యం ఒకానొక ఫలాన్నిస్తుంది.

దుష్కార్యాలు దుష్ఫలాలనిస్తాయి! సుకార్యాలు సుఫలాలనిస్తాయి!

చక్కటి సగంధపుష్పాలతో, తియ్యటి సుమధుర ఫలాలతో విరాజిల్లుతూవున్న వనం, ఎంత చూడముచ్చటగా వుంటుందో!

పుష్పాలతో, ఫలాలతో వృక్షాలు తమను తాము అలంకరించుకోవటమే కాకుండా, తమను తాము అర్థవంతం చేసుకోవటమే కాకుండా, మిగతా సృష్టిసంతటినీ అలరింప చేస్తాయి!

అలాగే, ధ్యాన పుష్పాలతో, ధ్యానఫలాలతో విలసిల్లని మానవజీవితాలు, మృతప్రాయమైన జీవితాలు!

ధ్యానసాధన ద్వారా పొందే ఫలాలు 'దివ్య ఫలాలు'

"తస్మాత్ యోగీ భవార్జున! " అని శ్రీకృష్ణుడు; దాని అర్థం - "ధ్యాన ఫలాలు పొందవోయ్, బడ్డూ!" అని.

ఇక మనం చేసేది ఏముంది? 'వెధవది' తప్పేటట్లు లేదు! శ్రీ కృష్ణుని ఆదేశం జవదాటలేం గదా?

తప్పదు, శిరసావహించవలసిందే !

"ఆనాపానసతి - విపస్సన" ధ్యాన పద్ధతిని ప్రచారం చేయటమే పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ యొక్క ముఖ్య ఉద్దేశ్యం.

దుఃఖరాహిత్యమే, జన్మరాహిత్యమే, మనం అందరం కోరుకునే, ఆశించే ధ్యాన ఫలం.

సంగీత సాధన చెయ్యకపోతే 'సంగీత ఫలం' దక్కదు!

వ్యవసాయ సాధన చెయ్యకపోతే 'వ్యవసాయ ఫలం' దక్కదు!

వ్యాపార సాధన లేకపోతే 'వ్యాపార ఫలం' సిద్ధించదు!

అలాగే ధ్యానం చేయకపోతే 'ధ్యాన ఫలం' లభించదు! ధ్యానం చేస్తే 'ధ్యాన ఫలం' లభిస్తుంది !

ధ్యాన విందు భోజనానికి ముముక్షువు లందరూ ఆహ్వానితులే! ప్రవేశ రుసుం లేదు !

పిల్లలూ, పెద్దలూ, వృద్ధులూ 'ఆల్ ఆర్ వెల్ కమ్'! సకల దేశకాల పరిస్థితులలోనూ, విందు భోజనం రెడీ రెడీ !

రకరకాల ఫలాలు! రకరకాల క్రొత్త రుచులు! రకరకాల క్రొత్త అనుభూతులు!

యిక మాటలు కట్టిపెట్టి కార్యం మొదలు పెడదాం! కళ్ళు మూసుకుని 'శ్వాస మీద ధ్యాస' పెడదాం ! ఎక్కడి వారు అక్కడే 'గప్ చుప్'!



## " 'పేరు'లో 'హోరు' "

పేరు 'పేరు' కాదు; పేరులో దాగి ఉంది మహా - హోరు'!

"స్వామి" అంటే తనను తాను స్వాధీన పరచుకున్నవాడు.

"సాధువు"అంటే సరళ స్వభావం ఉన్నవాడు.

"మౌని" అంటే ఎక్కువగా మౌనంలో ఉండేవాడు.

"ఋషి" అంటే దివ్యచక్షువును ఉత్తేజింప చేసుకున్నవాడు.

"మహాఋషి" అంటే దివ్యచక్షువు తో సమస్త సృష్టి రహస్యాల్నీ చూసేవాడు.

"సజ్జనులు" అంటే సత్యస్వరూపాన్ని సూత్రప్రాయం గా నైనా తెలుసుకున్న జనులు.

"భగవాన్" అంటే శాశ్వత భాగ్యాన్ని పొందిన భాగ్యవంతుడు.

"మహాత్మ " అంటే తన్ను తాను అందరికీ సమర్పించుకున్న ఆత్మ. "పరమాత్మ" అంటే తన్ను తాను అందరికీ సమర్పించుకున్న వాళ్ళలో "నెంబర్ : 1" అన్నమాట. ఆధ్యాత్మిక శాస్త్ర పరమైన మహాత్ములను పరమాత్ములంటాం. "పేరులో ఏముంది ? అనకండి!

పేరులో సర్వస్వమూ దాగి ఉంది. పేరులో మహా హోరు ఉంది.

"ధ్యాన ఫలం అన్న పేరులో ఎంత జోరు , ఎంత హోరు ఉందో!

# " 'నం' కాన్సెప్ట్!"

మానవుడి జీవితం సరళం గా , ఆరోగ్యవంతం గా, ఆనందమయం గా, అర్థవంతం గా జీవింపబడాలి అంటే నాలుగు 'నం'లు అవసరం! మొట్టమొదటిగా మానవుడి జీవితం సరళం కావాలి. అంటే మహాత్మా గాంధీగారు అన్నట్లు "మానవుడివి కావాలి".

మానవుడి జీవితం 'సరళం' గా ఎలా అవుతుంది? మనం ఏం చేస్తే సరళం అవుతాం? ఏ విధంగా అంటే - 'నోర్మూసుకుంటే' - అంటే 'మౌనం' పాటించాలి. యిదే మొట్టమొదటి 'నం'.

విధిగా రోజుకు కొన్ని గంటలు, మరి వారానికి కొన్ని రోజులు, లేదా కనీసం వారానికి ఒక్కరోజైనా 'మౌనం' పాటించాలి. మానవుడు తన 'అతి వాగుడు' వల్ల లేనిపోని కష్టాల్ని విస్తారంగా కొని తెచ్చుకుంటున్నాడు.

నిరంతర మితభాషిత్వం వల్లా, అప్పుడప్పుడూ సంపూర్ణ మౌనం వల్లా మానవుడి జీవితం అద్భుతంగా సరళం అవుతుంది. కనుక, మొట్టమొదటి సూత్రం ఏమిటంటే "మానవుడి జీవితం సరళం కావాలంటే మౌనసాధన అత్యవసరం".

ఇకపోతే, మానవుడి జీవితం 'ఆరోగ్యమయం' కావాలి. మానవుడు 'నిత్య స్వస్థత' కలిగి వుండాలి; సదా శక్తివంతుడై వుండాలి. దీనికి అవసరం "రెండవ 'నం' " అంటే "ధ్యా'న'ం".

'ధ్యానం' వల్లనే నాడీ మండల శుద్ధి జరిగి పూర్వ జన్మకర్మలు ప్రక్షాళితమై వర్తమాన జీవితం ఆరోగ్యమయం గా, శక్తివంతం గా తయారవుతుంది. అన్యధా శరణం నాస్తి కనుక, రెండవ సూత్రం ఏమిటంటే "ఆరోగ్యానికీ, శక్తికీ తప్పనిసరిగా అవసరం 'ధ్యానం' ".

ఇంకా ముందుకుపోతే మనిషి జీవితం ఎప్పుడూ 'అర్థవంతం'గా వుండాలి! ప్రతి చూపూ, ప్రతి తలపూ, ప్రతి పలుకూ, ప్రతి చేష్టా అర్థవంతంగా వుండాలి. దీనికి తప్పదు "మూడవ 'నం'..... అదే జ్ఞా'నం' - అంటే "ఆత్మజ్ఞానం". అంటే, "ఆధ్యాత్మిక విజ్ఞానం" - అంటే "స్పిరిచ్యువల్ సైన్స్".

అందరికీ తెలిసినదే, ఏమిటంటే "పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ వారు అందరికీ అందించేదే జ్ఞా'నం' అని.

కనుక, మూడవ సూత్రం ఏమిటంటే, "మానవుడి జీవితం 'అర్థవంతం' కావాలంటే విధిగా వుండవలసిన వస్తువే ఆత్మజ్ఞానం". ఆత్మజ్ఞానం లేనివాడి ప్రతి చూపూ, ప్రతి తలపూ, ప్రతి పలుకూ, ప్రతి చేష్టా మూడొంతులు అర్థరహితమైనవే! ఆత్మజ్ఞానం వున్నవాడి ప్రతి చూపూ, ప్రతి తలపూ, ప్రతి పలుకూ, ప్రతి చేష్టా నూటికి నూరుపాళ్ళు అద్భుత అర్థసహితమే అయి తీరుతుంది!

ఇకపోతే, చివరిగా మానవుడి జీవితం 'ఆనందమయం' కావాలి !

దీనికీ వుంది ఒక మార్గం. అదే "గా'నం""- మధురగానం' వాస్తవానికి చెవులెందు కున్నాయ్ ? చక్కటి సంగీతం వినడానికే ! కంఠం ఎందుకు వుంది ? చక్కటి గానం చేయడానికే !

కనుక, మానవుడి జీవితం 'ఆనందమయం' కావాలంటే అనేకానేక కళలు నేర్చుకోక తప్పదు. ముఖ్యంగా సంగీత కళ నేర్చుకునే ముందు విశేషంగా వినాలి. కనుక, జీవితంలో మాటలు తగ్గించి పాటలు, సంగీతం వినడం అన్నది హెచ్చించాలి.

కనుక, ఈ విధంగా మానవుడి జీవితం 'సరళం'గా, 'ఆరోగ్యం'గా 'అర్థవంతం'గా, 'ఆనందమయం'గా కావాలంటే తప్పదు 'నాలుగు నం'లు. అవే ....

"మౌ'నం'; ధ్యా'నం'; జ్ఞా'నం'; గా'నం'"

- ✧ నోర్మూసుకుంటే 'మౌనం'.
- ✧ నోరూ, కళ్ళూ మూసుకుని నాసికలోని శ్వాసను గమనిస్తే 'ధ్యానం.'
- ✧ నాడీ మండలం ప్రక్షాళనమయిన తరువాత మెదడు నుపయోగిస్తే 'జ్ఞానం'
- ✧ అన్నింటినీ వదిలేసి కంఠాన్నీ, చెవుల్నీ సానబడితే 'గానం'.

# "సత్యమేవ జయతే! ధ్యాన మేవ జయతే!"

"సత్యమేవ జయతే!" అన్నది ఉపనిషత్ సూక్తి. అంటే, "సత్యమే ఎప్పుడూ జయిస్తూ ఉంటుంది" అసత్యమే ఎప్పుడూ ఓడిపోతూ వుంటుంది.

అయితే - సత్యం మబ్బుల ద్వారా అప్పుడప్పుడూ 'కనుమరుగు' కావచ్చు. కానీ, 'సూర్యగోళం' అయిన సత్యం అంతలోనే దేదీప్యమానంగా కంటికి మళ్ళీ ప్రత్యక్షం అవుతుంది.

ఏది సత్యం ? ఏది అసత్యం ?

నిత్యమైనదే సత్యం !

అనిత్యమైనదే అసత్యం !

మరి ఏది నిత్యం ? ఏది అనిత్యం ?

ఆత్మే నిత్యమైనది; అనాత్మే అనిత్యమైనది.

కనుక, 'ఆత్మ' అన్నదే సత్యం. 'ఆత్మ అన్నదే 'స్వయంప్రకాశమైన సూర్యగోళం' మనస్సులోని మాలిన్యాలే ఆత్మను కనుమరుగు చేసే 'కారుమబ్బులు'.

'మాలిన్యం' అంటే త్రికరణ శుద్ధి రాహిత్యమే - అంటే మనసా, వాచా, కర్మణా ఏకంగా వుండకపోవటమే !

అంతేగాక, 'నేను మేను ని' అన్న అజ్ఞానమే ఆత్మ వెలుగుకి 'తెర' కట్టేది.

"తెర తీయగ రాదా ?" అని శ్రీ త్యాగరాజ స్వామి ఎంతగా మొరబెట్టుకున్నా, ఎంతగా ప్రార్థించినా, బయట నుంచి 'తెర తీసే నాథుడు' ఎవ్వడూ వుండడు ! మనం మన తమో, రజో గుణాలతో జన్మ జన్మలుగా అల్లుకున్న 'తెర'ను మనమే స్వప్రయత్నంతో కరిగించుకోవాలి. మన 'తెర'ను శూన్యం చేస్తేనే తప్ప మన 'సత్యం', మన 'ఆత్మ' మళ్ళీ జ్వాజల్యమానంగా ప్రకాశించదు. అందుకు దానికి ఒక్కటే మార్గం । అదే "ఆనాపానసతి - విపస్సన ధ్యాన విధానం".

"అసత్యులమై, నిత్య ఓటములతో, నిత్య నిరాశా నిస్పృహలకు లోనవుతూనే వుండాలా ? లేక, "సత్యులమై, నిత్య జయాలతో, నిత్య విజయాలతో, నిత్యానందులుగా విలసిల్లుతూ వుండాలా?" అన్నది ఎవరికి వారే ఎప్పటికప్పుడు నిర్ణయించుకోవాలి.

ఈ నిర్ణయం - అంటే, "సత్యమా, అసత్యమా ?", "జయమా, అపజయమా?" "ధ్యానమా, ప్రార్థనా?", "ఇప్పుడా, తరువాతా ?",

"అంతరంగమా, బహిరంగమా?", ఈ విధంగా ప్రతి ఒక్కరూ ఎవరికి వారే ఎప్పటికప్పుడు తమ తమ ఏకాంత స్థితుల్లో పూర్తిగా విశ్లేషించి సరైన నిర్ణయాలను తీసుకుంటూ వుండాలి.

అయితే "పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్, ఇండియా" మట్టుకు అందరికీ ఇచ్చే సందేశమేమిటంటే "సత్యమేవ జయతే ! ధ్యానమేవ జయతే!".



# "శ్వాస మీద ధ్యాస"

మనిషి ప్రపంచాన్ని జయించాలనుకుంటున్నాడు.

కానీ తనను తాను జయించలేక పోతున్నాడు.

మనిషి ఇతరులను బాగు చేయాలనుకుంటున్నాడు; కానీ, తనను తాను బాగుచేసుకోలేని వెర్రిబాగులవాడవుతున్నాడు!

"....తప్పులెన్నువారు తమ తప్పులెరుగరు విశ్వదాభిరామ వినురవేమ!!"

మనిషి ప్రక్కింటివాడి కన్నా గొప్పవాడు కావాలనుకుంటున్నాడు ...

వస్తు వాహనాదులలో, అంబర భూషణాదులలో.

కానీ, "ఓ వివేకానందుడి కన్నా, ఓ రమణ మహర్షి కన్నా నేనెందుకు గొప్పవాడిని కాకూడదు ?" అని ఎవ్వరూ అనుకోవట్లేదు!

మనిషి 'ధనవంతుడు' కాగోరుతున్నాడు; కానీ 'జ్ఞానవంతుడు'గా కావడానికి ఆలోచనే చేయడం లేదు!

ఇక ఈలాంటి మనిషికి మనం తిలోకాలిద్దాం; క్రొత్త మనుషులను తయారు చేద్దాం!

క్రొత్త దివ్య జీవితాలకు అంకురార్పణ గావించుదాం!

మనిషి ఇప్పుడు తనలోని దోషాలను దూరం చేసుకోవాలి!

ప్రతి మనిషీ ఓ వివేకానందుడూ, ఓ రమణ మహర్షీ కావాలిప్పుడు.

వారి కన్నా ఇంకా గొప్పగా, చాలా గొప్పగా కావాలి!

జ్ఞానాన్నే పై లోకాలకు తీసుకువెళ్తాం కనుక, ధనాన్నంతా ఇక్కడే వదిలిపెడ్తాం కనుక,

ఇక ప్రతి మనిషీ జ్ఞానవంతుడుగా కావడానికి నిశ్చయించుకోవాలి!

ఇదంతా సాధించాలంటే ఉన్నది ఒక్కటే ఒక్కటే మార్గం!

అదే ధ్యాన మార్గం - అంటే 'శ్వాస మీద ధ్యాస' అంటే 'ఆనాపానసతి'

ప్రతి మనిషీ, ప్రతి రోజూ తనకు ఉన్న ఇరవై నాలుగు గంటల్లో కనీసం ఒక గంట శ్వాస మీద ధ్యాస ఉంచాలి.

తల్లిదండ్రుల మీద ధ్యాస, భార్య మీద ధ్యాస, పిల్లల మీద ధ్యాస, ఉద్యోగం మీద ధ్యాస, వీటన్నింటితోపాటు విధిగా 'శ్వాస మీద ధ్యాస' కూడా ఉంచాలి!

శ్వాస మీద విశ్వాసముంటే విశ్వాన్నే జయించవచ్చు!

వుంచాలి శ్వాస మీద ధ్యాస - పెంచాలి శ్వాస మీద ధ్యాస.

'శ్వాస' అంటే 'హంస'! 'శ్వాస మీద ధ్యాస' అంటే 'హంసాభ్యాసం' చేయడం! హంసా విన్యాసాల్ని గమనించడం! హంస ధ్వని వినడం! హంసామృతాన్ని గ్రోలడం! 'హంసతూలికాతల్పం' మీద సుఖనిద్రపోవడం! 'హంస గమనం' చేయడం!



# "హ్యాపీ న్యూ ఇయర్!"

జీవితం ఎప్పటికప్పుడు క్రొత్తే! జీవితం ఎప్పుడూ వినూతనమైనదే!

అయితే, దృష్టిలోపం వల్ల ఆత్మజ్ఞానం లేనివారు ఎప్పటికప్పుడు "పాత జీవితాన్నే అనుభవిస్తున్నాం' అని అనుకుంటూంటారు.

ఒక్క క్షణం క్రింద వున్న జీవితం యిప్పుడు వుండడం అసంభవం !

జీవితం పారే నది లాంటిది !

నీరెప్పుడూ మారుతూనే వుంటుంది !

జీవిస్తున్న ప్రతిక్షణంలోని నూతనత్వాన్ని ఆస్వాదించడమే ఆత్మజ్ఞానం యొక్క విస్ఫోటనం !

'ధ్యానం', 'ఆత్మజ్ఞానం' అంటే శ్వాసను గమనిస్తూ, కళ్ళు మూసుకుని కూర్చోవడమే కాదు!

కళ్ళు తెరచి వున్నపుడు గమనించబడే ప్రతి క్షణంలోని నూతనత్వాన్ని ఆస్వాదించడం కూడా జ్ఞానమే ! వాస్తవానికి అదే 'వికసిత ఆత్మజ్ఞానం'.

ఇంతరవకు 'న్యూ' గురించి చెప్పకున్నాం; ఇక 'హ్యాపీ' గురించి చెప్పకుందాం.

నిజానికి జీవితం ఎప్పడూ 'హ్యాపీ'యే!

ఆత్మజ్ఞానం లేకే మానవుడు దుఃఖాన్ని అనుభవిస్తున్నాడు; నిజానికి 'దుఃఖం' అన్నది ప్రకృతిలో ఎక్కడా లేదు.

'చావే' లేనప్పడు 'దుఃఖం' ఎక్కడిది ? వాస్తవానికి ఎటుచూసినా 'హ్యాపీ', హ్యాపీ' 'హ్యాపీ'యే!!!

ఉన్నదంతా హ్యాపీయే! వున్నదంతా హ్యాపీగానే వున్నప్పడు ఇక క్రొత్తగా వస్తున్నది మరి యింకెంత హ్యాపీ!!!! కనుక, "హ్యాపీ న్యూ ఇయర్"!!!

# "పరమహంస"

మానవ జన్మలో పాటించవలసినవి - రెండే రెండు!

అందులో ఒకటి వదలిపెట్టవలసినది ;

రెండవది చేపట్టవలసినది.

వదలిపెట్టేయవలసింది 'హింస!

చేపట్టవలసింది - 'హంస'!

'హంస' అంటే 'శ్వాస'!

మానవుణ్ణి దానవునిగా చేసేది - 'హింస.'

మానవుణ్ణి దివ్యునిగా చేసేది - 'హంస'.

ప్రతి యోగీ ఒక 'పరమ హంస'.

నిత్యయోగ సాధకులే 'పరమ హంస'లు కాగలరు.

పిరమిడ్ మాస్టర్లందరూ 'పరమ హంసలు'!

ఆంధ్రప్రదేశ్‌లోని ప్రజలందరినీ 'హంసలు'గా మార్చడానికి కంకణం కట్టుకున్నాయి పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీలు!

'హంస'ను అనుసరిద్దాం - పరమహంసలమవుదాం!



# "స్వర్ణాంధ్రప్రదేశ్!"

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం చక్కటి కలలు కంటోంది - అదే 'స్వర్ణాంధ్రప్రదేశ్'! నేటి కలలే రేపటి వాస్తవాలకు మూల బీజాలవుతాయి.

కలలనేవి 'కల్లలు'కావు.... !

భవిష్యత్తులో మనకు కావాల్సిన వాటిని కావాల్సిన విధంగా మనం స్వయంగా తీర్చిదిద్దుకునే 'సుత్తీ కొడవళ్ళే' నేడు మనం కనే 'కల'లు...!

అయితే, కేవలం 'చక్కటి కలలు' కంటే, 'కేవలం కంటూనే వుంటూంటే' ఏమీ లాభం లేదు!

రాష్ట్రం స్వర్ణసదృశం కావాలంటే దానికి ఏది కావాలో అది చెయ్యాలి!

'రాష్ట్రం' అంటే, 'దేశం' అంటే, 'మట్టి' కాదు 'ప్రజలు'!

దేశంలోని ప్రజలు మట్టికొడుతూ వుంటే దేశం కూడా మట్టికొడుతూనే వుంటుంది;

ప్రజలు అయోగ్యులైతే రాష్ట్రం అయోమయంగా వుంటుంది.

ప్రజలు యోగ్యులుగా వుంటేనే రాష్ట్రం స్వర్ణమయమవుతుంది.

'యోగ్యత' అన్నది 'యోగ పరిచయం' ద్వారా అంకురించి, క్రమక్రమంగా పటిష్టయోగ సాధన ద్వారా పుష్పించి, ఫలిస్తుంది.

కేవలం భౌతికపరమైన శాస్త్రవిజ్ఞానంతో మాత్రమే అయితే 'యోగ్యత' అన్నది ఎప్పటికీ సిద్ధించదు; కేవలం భౌతిక పరమైన విజ్ఞానంతోనే యోగ్యత అన్నది గగన కుసుమమే!

మరి ఆధ్యాత్మపరమైన విద్య అభ్యాసం ద్వారానే, యోగానుష్ఠానం ద్వారానే ప్రజలు యోగ్యులై విలసిల్లేది.

ఆంధ్ర రాష్ట్రంలోని ప్రజలందరూ యోగ్యులు కాకుండా 'స్వర్ణాంధ్ర' అనే కల ఎప్పటికీ 'కల్ల'గానే వుంటుంది!

ఒక్కమాటలో చెప్పాలంటే 'ధ్యానాంధ్రప్రదేశ్' కాకుండా 'స్వర్ణాంధ్రప్రదేశ్' సృష్టి అన్నది 'గాలిలో పెట్టిన దీపం'! 'పేక మేడ',! 'ఆకాశ హర్మ్యం'!, 'మృగతృష్ణ'!

ధాన్యాంధ్రప్రదేశ్ కావాలంటే ఆంధ్రప్రదేశ్‌లోని ప్రజలందరూ విధిగా, తప్పనిసరిగా రోజుకు కనీసం గంటైనా ఆనాపానసతి ధ్యానంలో నిమగ్నం కావడం నేర్చుకోవాలి.

ఒక్కటే ఒక్క ధ్యాన రీతి . . .

అదే 'వాయు పుత్రుడు' కావడం - అదే 'మారుతీ పుత్రుడు' కావడం!

అదే 'పవన పుత్రుడు' కావడం - అదే 'హంస పుత్రుడు' కావడం !

అదే శ్వాస మీద ధ్యాస - అదే ఆనాపానసతి-అదే సుఖమయ ప్రాణాయామం - అదే కుంభక రహితమైన కేవల పూరక రేచకం!

ఒకళ్ళ కుత్తుకలొకరు కోసుకుంటూ ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ 'రుధిరాంధ్రప్రదేశ్' లాగా వుంది.

మొదట అందరూ హింసను వదలిపెట్టేయాలి! ఎవ్వరికీ మరొకరిని హింసించే హక్కు లేదు!

"అహింసో పరమోధర్మః" అన్నాడు కదా గౌతమ బుద్ధుడు 2500 సం॥ క్రిందటే ! అయినా బుద్ధి ఇంకా రాలేదు, ఆంధ్రప్రజలకూ మరి ప్రపంచప్రజలకూ.

బుద్ధుడు పుట్టిన దేశంలోనే బుద్ధి లేదు ఎవ్వరికీ! అదేం చోద్యమో! ఆదేం విచిత్రమో!

ఇకనైనా హింసను వదిలిపెట్టేద్దాం! ఇకనైనా హంసను పట్టుకుందాం!

హింసే 'రుధిరాంధ్రప్రదేశ్'కు మూలకారణం అయ్యింది; హంసే 'స్వర్ణాంధ్రప్రదేశ్'కు మూలబీజం అవుతుంది.

హింసాత్మకం + అహంసాత్మకం = రుధిరాంధ్రప్రదేశ్!

అహింసాత్మకం + హంసాత్మకం = స్వర్ణాంధ్రప్రదేశ్!

పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్, ఇండియా జిందాబాద్! అన్యధా శరణం నాస్తి!

# "ధ్యాన పుష్పం - జ్ఞాన పరిమళం"

ఆత్మజ్ఞానం లేని మానవులు 'పరిమళం లేని పుష్పాలు'.

పరిమళం అనేది ఒక పుష్పం యొక్క 'ఆరా'!

ఆ పరిమళం ఎంత దూరం విస్తరించి ఉంటుందో అంత మహత్తు ఆ పుష్పానికి వుందన్నమాట !

ప్రతి మనిషి యొక్క 'శక్తి', 'జ్ఞానం', 'చైతన్యం' అనేవి పూర్తిగా విస్తరించుకుని వుండాలే కానీ 'కుంచించు'కుని వుండరాదు !

మనస్సులోని 'శక్తి, 'జ్ఞానం', 'చైతన్యా'లు విజృంభించాలంటే 'ధ్యాన - స్వాధ్యాయ - సజ్జన సాంగత్యా'లు మరి తప్పనిసరి !

'శక్తి' అన్నది 'ధ్యానం' వల్ల విజృంభిస్తుంది; జ్ఞానం స్వాధ్యాయం వల్ల వ్యాప్తమౌతుంది !

'చైతన్యం' పజ్జన సాంగత్యం వల్ల విస్తృతం అవుతుంది.

'ధ్యాన - స్వాధ్యాయ - సజ్జన సాంగత్యా'లే మనిషి విధిగా ప్రతిరోజూ చేయవలసిన నిత్య కార్యక్రమాలు.

పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ ఇండియా' వారి ప్రచార నినాదం 'ధ్యాన, స్వాధ్యాయ సజ్జన సాంగత్యాలే!

ఏ మనిషిలో ధ్యాన - స్వాధ్యాయ - సజ్జన సాంగత్యాల ద్వారా 'శక్తి - జ్ఞానం - చైతన్యం' అన్నవి విస్తరించి వుంటాయో ఆ మనిషి బ్రహ్మాండమైన 'పరిమళ' సహితుడైన 'పుష్పం' అవుతాడు. అతని ఖ్యాతి లోకలోకాలకు విస్తరిస్తుంది ! ఆ పరిమళం సమస్త సృష్టినే ముంచేస్తుంది !

ప్రతి పిరమిడ్ మాస్టర్ కూడా అంతులేని జ్ఞాన పరిమళ భరితుడైన ఓ ధ్యాన పుష్పం ! ఆంధ్రదేశం అంతా మొత్తం 'ధ్యానపరిమళ మయం' కావాలి !

# "ధ్యాన కిరీటం"

'భక్తి' అనేది 'యోగం' కాదు - 'రోగం'!

'కర్మ' అనేది 'యోగం' కాదు - 'ధర్మం'!

'జ్ఞానం' అనేదే యోగం - 'జ్ఞాన యోగం'!

'ధ్యానం' అనేదే యోగం - 'రాజ యోగం'!

'కిరీటం' అన్నది రాజత్వానికీ, రాజసానికీ చిహ్నం.

రత్నఖచిత కిరీటాలు రారాజులు ధరిస్తూ వుంటారు.

పరమ యోగులు మాత్రం ధ్యాన కిరీటాలను అలంకరించుకుంటారు!

శ్రీ వేంకటేశ్వరస్వామి ఒకానొక అద్భుతమైన యోగీశ్వరుడు; అపారమైన యోగ సాధన ద్వారా 'ధ్యాన కిరీటధారి' అయినవాడు.

భౌతిక రారాజులకూ ధ్యాన రారాజులకూ మధ్య ఎంత వ్యత్యాసమో!

భౌతిక రారాజులు అయిన వారు స్వయంగా శాంతి శూన్యులు. ఇతరులకూ శాంతిని ఇవ్వలేనివారు. వారికి ఎన్ని రాజ్యాలు, సంపదలు వున్న అసంతృప్తే.

ధ్యాన రారాజులకు మాత్రం 'ఆది', 'మధ్యం', 'తుది' అంతా శాంతిమయమే!

తమతో కలిసిన వారందరిని కూడా శాంతిమయులుగా చేయగలిగినవారే!

ప్రతి ఒక్కరూ 'ధ్యాన కిరీటధారులు' అవ్వాలి !

శ్రీ వెంకటేశ్వరస్వామి లాంటి యోగి పుంగవుల అడుగుజాడలలో నడవాలి అందరూ !

అదే వేంకటేశ్వరస్వామి యొక్క నిజమైన ఆకాంక్ష !

తిరుమలలోని 'స్వచ్ఛమైన భక్తి' అన్నది 'నిష్ఠ అయిన రాజ యోగ సాధన'గా సత్వరంగా రూపాంతరం చెందాలని వాంఛిస్తూ ....

# "ధ్యాన జ్ఞాన సాధనలు"

మనిషి 'అల్పజ్ఞత' నుంచి 'మహావిజ్ఞతకు' చేరుకోవాలంటే చేపట్టవలసినవే 'ధ్యాన జ్ఞాన సాధనలు'.

"ధ్యాన సాధన" అంటే "ఆనాపానసతి - విపస్సన " మార్గం.

"జ్ఞాన సాధన" అంటే "నా కర్మలకు నేనే బాధ్యుడును; నా స్థితికి నేనే బాధ్యుడను". అన్నది తెలుసుకుని సదా దైనందిక జీవితంలో జాగరూకులై ఉండడం.

ప్రతిరోజూ విధిగా ధ్యాన సాధన చేయాలి, కనీసం ఒక గంటయినా! మరి జ్ఞాన సాధన అన్నది, ప్రతిక్షణం మరచిపోకూడనిది.

ప్రపంచంలో మూడు వర్గాల వారు వున్నారు.

'సాధనలో లేనివారు', 'సాధనలో వున్నవారు', మరి 'సిద్ధులైనవారు' అని మూడు వర్గాలుగా ప్రజలు వున్నారు. సాధనలో లేనివారు, తక్షణమే సాధకులు గా మారాలి. సాధకులు గా వున్నవారు మరి రేపో మాపో తప్పకుండా సిద్ధులౌతారు; సిద్ధులైన వారు ఇంకా సాధకులు కాని వారందరినీ సాధకులుగా చేయాలి.

ఈ ప్రపంచంలో చిట్టచివరికి ప్రతి మనిషీ సిద్ధుడుగా అవ్వాలి.

కనుక, ప్రతి మనిషి "ధ్యాన జ్ఞాన సముపార్జన"లో నిమగ్నం కావాలి. అందరినీ, అంటే పిల్లలనూ- పెద్దలనూ, స్త్రీలనూ - పురుషులనూ, చదువుకున్న వారినీ - చదువులేనివారినీ - ఈ విధంగా అందరినీ ధ్యాన యోగులు గా, జ్ఞాన యోగులు గా మలచడమే "పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ"ల యొక్క ఏకైక ధ్యేయం.

# "ధ్యాన లోకం!"

భూలోకం అతి త్వరలో ధ్యానలోకం కాబోతోంది!

అది 'భవిష్యత్ ' వాణి ! అది 'ఋషి' దర్శన సారం!

భూలోకం ధ్యానలోకం కానాలటే ప్రతి దేశమూ, ప్రతి రాష్ట్రమూ, ప్రతి గ్రామమూ ధ్యాన మయం కావాలి.

అందుకోసమే ఆవిర్భవించాయి - "పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ ఇండియా"

ప్రతి పట్టణం "ధ్యాన పట్టణం"గా విలసిల్లాలంటే ప్రతి పట్టణం లోని ప్రతి బాలుడు, బాలిక, యువకుడు, యువతి,వృద్ధుడు, వృద్ధురాలు - అందరూ కూడా ధ్యానమయులుగా కావాలి. అందుకోసమే కంకణం కట్టుకున్నాయి "పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ - ఇండియా"

ఇక ఏ పట్టణంలోనూ పామరులు ఉండరాదు-

ఆత్మజ్ఞానులే ఉండాలి- పండితశ్రేష్ఠులే ఉండాలి! అది అందరూ "ఆనాపానసతి విపస్సన ధ్యాన" మార్గం అవలంబిస్తేనే సాధ్యం.

అందరికీ 'ఆనాపానసతి - విపస్సన' ధ్యాన మార్గం బోధించడం కోసమే ఆవిర్భవించాయి పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్, ఇండియా.

"ఆనాపానసతి - విపస్సన" ధ్యాన మార్గమే వాస్తవానికి మునుపటి కృష్ణ ప్రభోధితం, మహావీర ప్రభోధితం, బుద్ధ ప్రభోధితం, ఆదిశంకర ప్రభోధితం; అదే మన వర్తమాన ప్రభోధితం.

సత్యం అనేక రకాలుగా ఎప్పుడూ ఉండదు! అదెప్పుడూ ఏకరీతి లోనే ఉంటుంది. ఉన్న ఒక్కగానొక్క సత్యమార్గాన్ని అందరికీ ప్రభోధించడమే పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ ఇండియా వారి ఏకైక ధ్యేయం".

# "రమతే బాలోన్మత్తవ దేవ!

ధ్యానం లో 'విజయం' సంపాదించాం!

ధ్యాన విజయులమయ్యాం! తర్వాతేమిటి? 'ఆనక' మన పరిస్థితి ఏమిటి?

ఆ తర్వాత ఉన్నదే "రమతే బాలోన్మత్తవదేవ"

"యోగి అయిన వాడు" అంటే అర్థం "ధ్యానం లో విజయుడైనవాడు" అని.

"ధ్యానం లో విజయుడైనవాడు" అంటే అర్థం "జ్ఞానాన్ని సముపార్జించినవాడు" అని

"జ్ఞానాన్ని సముపార్జించినవాడు" అంటే అర్థం "తానే అంతటా ఉన్నాను" అని ఎరిగిన వాడు;

"తాను కాకుండా వేరొకటేది లేదు" అని అనుభవానికి వచ్చినవాడు.

అంటే, ఇక అరిటాకు వచ్చి ముల్లు మీద పడ్డా, లేదా ముల్లు వచ్చి అరిటాకు మీద పడ్డా' 'తానే ముల్లు, తానే అరిటాకు' కనుక, "క్రింద పడ్డా, మీద పడ్డా తానే గెలిచినట్లు!" అన్నమాట. అదీ విజయమంటే! అప్పడిక మిగిలిందేమిటి, ఎల్లవేళలా ఆందోళనా రహితంగా సుఖించటం తప్ప!

చిన్న పిల్లలు సదా కేరింతలు కొడుతూ ఉన్నట్లు, పిచ్చివాడెప్పడూ ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ వున్నట్లుగా వుండడం తప్ప !

ఇదే, "రమతే బాలోన్మత్తవదేవ" అంటే!

కభీ హసే, ఔర్ కభీ మూన్‌మే రహా జాయే, పర్ 'ధుఃఖిత్' కభీ న హోయే!



# "పూజ్యాయ రాఘవేంద్రాయ!"

"తనునాత్ త్రాయతే ఇతి తంత్రః" - అంటే 'తనువు' తో చేసే చేష్టలతో కూడిన యోగసాధన 'తంత్రం' అనబడుతుంది.

"మననాత్ త్రాయతే ఇతి మంత్రః"

అంటే - 'మనస్సు'తో అంటే 'ఆత్మ'తో, చేయబడే సాధన 'మంత్ర శాస్త్రం' అనబడుతుంది.

'బీజాక్షరాలు ఉచ్ఛరించడం' అనేది ఒకానొక శరీర భాగం తో, అంటే నాలుక తో చేసేదే కనుక అది తంత్ర శాస్త్రంలో భాగమే!

ఆత్మ యొక్క బాహ్యరూపమైన చిత్తం శూన్యమైనప్పుడు ఆత్మ యొక్క అంతర్ రూపమైన 'దివ్యచక్షువు' అన్నది ఉత్తేజితం కావడం ద్వారా అన్నింటినీ 'అపరోక్షం' గా 'అద్వైతం' గా అనుభవించడమే నిజంగా 'మంత్రం' అనబడుతుంది!

'మంత్రాలయ' స్థాపకుడు శ్రీరాఘవేంద్రస్వామి.

'మంత్రాలయం' అంటే 'ధ్యాన సాధనాలయం', 'యోగదృష్టి నిలయం' కాక మరేదైనా అవడం హాస్యాస్పదం!

పామరుడైనా, పండితుడైనా, యోగ పుంగవుడైనా అందరికీ ఒక్కటే మార్గం అదే 'చిత్త వృత్తి నిరోధం'!

చిత్త వృత్తి నిరోధానికి వున్న ఒకే ఒక సూత్రం - అదే ఆనాపానసతి.

సాధనా తీవ్రత అన్నది పామరుడికి 'పది మాత్రలు' అవసరమైతే, పండితుడికి 'ఐదుమాత్రలు'; యోగిపుంగవుడికైతే 'ఒక మాత్ర' సరిపోతుంది.

అంతకానీ, వేరు వేరు జనులకు 'వేరు వేరు మార్గాలు'ండవు! అయితే వేరు వేరు సాధనా తీవ్రతలు మాత్రం నిర్దేశింపబడి వుంటాయి!

తాను 'సిద్ధుడై, అందరికీ 'సిద్ధ' మార్గాన్ని చూపించాడు శ్రీ రాఘవేంద్రస్వామి!

ఆయన విగ్రహానికి 'పూజ'లు చేస్తే లాభం [illegible]ు!

"పూజ్యాయ రాఘవేంద్రాయ" అంటూ శతక[illegible] నామస్మరణ చేస్తే ఆయనకు అణుమాత్రమైనా రుచించదు!

'ధ్యానయోగ' సాధన చేస్తేనే, 'ఆత్మ జ్ఞాన' పరాయణులైతేనే, ఆయన దానిని 'పూజ'గా రిస్తాడు!

'నోటి కరాటే' ఇంక ఆపాలి- అంటే 'నోరు' మూసుకోవాలి!

కర్మవిన్యాసాలు కట్టి పెట్టాలి - అంటే , చేతులు రెండూ కలిపి పట్టుకోవాలి!

'తీర్థయాత్రలు' మానాలి - అంటే కాళ్ళు రెండూ ముడుచుకుని, వున్నచోటే చ్చోవాలి!

'అష్ట దిక్కుల' తో సంబంధాలు తెంచుకోవాలి -

అంటే కళ్ళు రెండూ మూసుకోవాలి!

ఇంక 'అంతర్ యానా'నికి ఉపక్రమించాలి - అంటే శ్వాస మీద ధ్యాస వుంచాలి!

ఇదే 'శ్రీ రాఘవేంద్రస్వామి' వారు తమ స్వంత జీవితంలో ఆచరించింది; మరి తంలో కొంత మంది చేత ఆచరింపచేసింది. ఇప్పుడు, తరుణం ఏతెంచింది ప్రపంచమంతా ఆయనను అనుసరించడానికి!

"ప్రతి ఒక్కరూ 'ఒక రాఘవేంద్రస్వామి' లా మారాలి!" - ఇదే పిరమిడ్ ములందరి ధ్యేయం!



# "ధ్యాన గిరి!"

'కొండెక్కడ' మంటే అందరికీ ఇష్టమే! పిల్లలకీ, పెద్దలకీ ఆఖరికీ వృద్ధులకు కూడా! ఎందుకంత ఇష్టత కొండలెక్కడమంటే?

కొండపైకెక్కి అంత ఎత్తు నుంచి ఆ రమణీయ ప్రకృతిని చూస్తే ఎంత అద్భుతమో! ఆ ఎత్తుల్లో ఎంత చక్కటి పిల్లగాలులు వీస్తూంటాయో!

దూరం నుంచి ఎంత చక్కగా అన్నీ చూడగలమో! ఆ ఎత్తుల్లో వున్నప్పుడు మన స్వభావం కూడా ఎంత ప్రశాంతంగా మారిపోతుంది!

జీవితం ఎంత మృదుమధురంగా వున్నట్లు తోస్తుంది! పక్షుల కిలకిలా రావాలతో మనం ఏకమై పోయినట్లు తాదాత్మ్యం చెందుతాం!

భౌతికమైన గిరుల మీదకు వెళ్ళినప్పడే ఇంత జరుగుతూ వుంటే, మరి ఇంక 'ధ్యాన గిరు'ల మీదకు, 'ఆధ్యాత్మిక పర్వతాల' మీదకు మనం యాత్రలు చేసినప్పడూ, విహారాలు చేసినప్పడూ ఇంకెంతగా మన జీవితాల్లో ఆనందం భాసిస్తుందో! మరి ఇంకెంతగా అనిర్వచనీయమైన అద్వైతానందాన్ని ఆస్వాదించ గలుగుతామో! చెప్పలేం ! అనుభవైకవేద్యమే కానీ, 'ఇదమిద్ధ'మని మామూలు వాడుక భాషలో రూపకల్పన చేయలేం!

ఇక 'ధ్యానం' అనే గిరులను ఎక్కుదాం! ఇక 'ఆత్మజ్ఞానం' అనే పర్వత శ్రేణుల్లో విహరిద్దాం!

ఇది ప్రతి ఒక్కరి అనుభవానికీ రావాలి! పిల్లలు కానీ, పెద్దలు కానీ, వృద్ధులు కానీ !



# "వాయుపుత్ర ఆంజనేయ స్వామి!"

'వాయుపుత్ర ఆంజనేయ స్వామి' ఇందులోనే - ఈ యొక్క పదప్రయోగం లోనే, 'ధ్యాన సమాచారం' అంతా నిక్షిప్తమైవుంది.

'వాయుపుత్రుడు' అంటే 'ఆనాపానసతి అభ్యాసం చేయడ'మే!

'అంజనం' అంటే 'దివ్యచక్షువు'; 'ఆంజనేయుడు' అంటే 'దివ్యచక్షువు కలిగినవాడు' ; 'స్వామి' అంటే 'నిర్వాణం పొందినవాడు'.

దివ్యచక్షువు యొక్క ఉత్తేజాన్ని 'విపస్సన' అంటాం; కనుక, 'వాయుపుత్ర ఆంజనేయస్వామి' అన్న సమాసం లో 'ఆనాపానసతి', 'విపస్సన', 'నిర్వాణం' అనే 'సంపూర్ణ ధ్యాన సమాచారం' ఇమిడి వుంది!

అలాగే ఆంజనేయస్వామి 'స్వాధ్యాయం' చేస్తూ వుండటం గమనించ వలసిన విషయం!

అలాగే, 'స్వాధ్యాయం' అన్నది పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ వారికి చాలా, చాలా ముఖ్యమైన విషయం. ఇక నుంచీ స్వాధ్యాయాన్ని పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ ధ్యానులు, మాస్టర్స్ మరింత ఉధృతం చేయాలి. అదే మన ఆదర్శ మాస్టరు "శ్రీ హనుమాన్ జీ" మనకు యిచ్చే ముఖ్యమైన సందేశం.



# "ధ్యానోదయం!"

భూమండలం ఒక క్రొత్త దివ్యయుగం లో ప్రవేశిస్తోంది!

మానవాళి అంతా రెండు రకాలుగా చీలిపోతోంది. ఒక ప్రక్క 'మూర్ఖనాస్తికులు', మరి 'మూర్ఖఆస్తికులు' గా - మరొక ప్రక్క 'నిజమైన యోగులు'గా - ఈ విధంగా రెండు వర్గాలు గా చీలిపోతోంది మానవాళి.

మొదటి వర్గం వారు సత్యాల్ని యింకా ఆమడ దూరం లోనే వుంచడానికి యిష్టపడు తున్నారు; రెండవ వర్గం వారు 'సత్యం' లో జలకాలాడుతున్నారు!

మొదటి వర్గం వారు కేవలం భౌతిక శాస్త్రం, భౌతికత మీదే ఆధారపడి వున్నవారు; రెండవ వర్గం వారు ఆత్మజ్ఞాన దురంధరులు! దైనందిక నిజ జీవితంలో ప్రస్తుత ప్రపంచంలో ఈ రెండవ వర్గం చక్కగా బలం వుంజుకుంటోంది. దానికి కారణం ప్రతి చోటా ధ్యానోదయం విస్తృతం కావడమే!

'అంతటా పూజలూ, ప్రార్థనలూ అంతరిస్తున్నాయి! ధ్యాన - జ్ఞాన సాధనలు అంకురిస్తున్నాయి!

ప్రస్తుత ప్రపంచంలో "భగవంతుడు ఎక్కడో ప్రత్యేకంగా లేడు; వున్నదంతా దైవ పదార్థమే" - ఈ విధంగా తెలుసు కుంటున్నారు అందరూ!

'అహం బ్రహ్మాస్మి', 'అయమాత్మా బ్రహ్మ' అన్న వేదసారాన్ని స్వానుభవం లోకి తెచ్చుకుంటున్నారు ధ్యానులు కోకొల్లలుగా!

ఇదొక 'దివ్యయుగ' ఉషోదయం! భూమండలం ఒక నూతన, తేజోమయ, అద్భుత, 'ఫోటాన్ అంతరిక్ష కక్ష్య' లోనికి ప్రవేశిస్తోంది. మనమంతా కలసి స్వాగతం యిద్దాం - భూమండలంలో ఈ అపూర్వ 'ధ్యానయుగ' ఉషోదయానికి!

పిరమిడ్ ధ్యానులందరి సంయుక్త కార్యక్రమమే ఈ 'ధ్యానోదయం'.

ప్రతి హృదయంలోనూ 'ధ్యానోదయం' కావాలి! ప్రతి మానవుడూ 'ధ్యాన శక్తి మయం' కావాలి!

చేద్దాం అందరం ధ్యానం! మరి చేయిద్దాం అందరి చేతా ధ్యానం !

'ధ్యానోదయం' జరిగితేనే దివ్య ఆరోగ్యమూ, సకల సౌభాగ్యాలూ, సకల కళ్యాణాలు అరచేతి స్వర్గాలుగా అందేవి!

'ధ్యానోదయా'నికి స్వాగతం ! 'ధ్యాన సూర్యోదయా'నికి సుస్వాగతం!!

❁ ❁ ❁

# "కలసి ఉంటే కలదు సుఖం!"

"కలసి ఉంటే కలదు సుఖం!" అన్నారు పెద్దలు,ఇది అద్భుతమైన వాస్తవం. తిరుగులేని సత్య సూత్రం.

అయితే, దేనితో 'కలిసి' ఉంటే? ...

... 'స్వంత ఆత్మ'తో కలసి ఉంటే!

... 'ఆత్మజ్ఞాన శాస్త్రం'తో కలిసి ఉంటే!

... 'ఆత్మజ్ఞాను'లతో కలిసి ఉంటే!

ఎవరి జీవితాలైతే పై మూడింటితో ముడిపడి ఉండవో, ఏకమై ఉండవో, అనుసంధానం చెంది ఉండవో - వారి జీవితాలలో సుఖం ఉండడం కల్ల!

"కలిసి ఉంటే కలదు సుఖం!"

కనుక,

1. ధ్యానం చేద్దాం - స్వంత ఆత్మానుభవాలతో కలసి వుందాం!

2. స్వాధ్యాయం చేద్దాం - పరిశోధింపబడిన ఆత్మజ్ఞాన శాస్త్ర రహస్యాలన్నిటితో కలిసి వుందాం !

3. సజ్జన సాంగత్యం చేద్దాం - ఆత్మజ్ఞాన పరాయణులందరితో కలిసి వుందాం !

పిరమిడ్ ధ్యాన సోదరులందరూ ప్రతిరోజూ పై మూడింటితో 'కలిసి ఉండడం' నేర్చుకోవాలి!

అప్పుడే ప్రతిరోజూ వారు అంతరాయ - రహితమైన సుఖాన్నీ, ఎడతెరిపి లేని ఆనందాన్నీ అనుభవించేది!

"కలసి ఉంటే కలదు సుఖం!"



# "అంతర్ముఖుడు అయినవాడే భాగ్యవంతుడు!"

- ప్రతి ప్రాణీ భోగాభిలాషియే!

- ప్రాణి ఉత్పత్తే సంభోగం లో వుంది!

- భోగమే ఉత్పత్తిగా గల ప్రాణి 'అనుక్షణం భోగాభిలాషి'గా వుండటం అన్నది అత్యంత సహజం! మరి ఎంతైనా సమంజసం కూడా!

- సృష్టిలోని ప్రతిప్రాణీ చక్కటి వైభోగంలో వెలుగుతోంది.

- ప్రతి పరమాణువు, ప్రతి అణువు, ప్రతి కణం, ప్రతి మొక్క, ప్రతి జంతువు, ప్రతి గ్రహం, ప్రతి ప్రోటాను - అన్నీ! ఒక్క మానవుడు తప్ప!

- సృష్టిలోని ప్రతి ప్రాణీ సహజ ధ్యానస్థితిలో వుంది - ఒక్క మానవుడు తప్ప!

- సృష్టిలోని ప్రతి ప్రాణీ సహజ భాగ్యస్థితిలో వుంది - ఒక్క మానవుడు తప్ప!

- "బహిర్ వస్తు సముదాయంలో భాగ్యం ఉంది" అనుకుంటున్నాడు వెర్రి మానవుడు!

- 'ఎక్కువ వస్తు సముదాయం' వున్నవాడిని 'ఎక్కువ భాగ్యవంతుడు' అని పిలుస్తున్నారు!

- వాస్తవానికి 'ఎక్కువ అంతర్ముఖుడు' అయినవాడే 'ఎక్కువ భాగ్యవంతుడు'!

- అంతర్ముఖ ప్రాప్తి అన్నది కేవలం ధ్యానం ద్వారానే సాధ్యం.

- 'ధ్యాన భాగ్యం' అన్నది గాక మరొక 'భాగ్యం' వుండటం అసంభవం.

- మానవులందరూ 'నిజమైన భాగ్యవంతులు' కావాలి; అంతే, అంతకన్నా పెద్ద కోరిక ఏమీ లేదు.



# "ఆరోగ్యమే మహాభాగ్యం!"

**మ**నిషికి కావలసినవి సుఖం, సంతోషం, శాంతి, ఆనందం.

'సుఖం' శరీరానికి సంబంధించింది;

'సంతోషం' మనస్సుకు సంబంధించింది;

'శాంతం' బుద్ధికి సంబంధించింది;

'ఆనందం' ఆత్మకు సంబంధించింది;

'మనిషి' అంటే నాలుగు - 'భౌతిక శరీరం', 'మనస్సు', 'బుద్ధి', 'ఆత్మ' - ఈ నాల్గింటి సమిష్టి రూపమే మానవుడు!

ఈ నాలుగూ అందులో మూడు ఉపకరణాలు, లేక ఉపాధులు - శక్తివంతంగా ఉంటేనే తత్సంబంధమైన వరుస క్రమంలో సుఖ, సంతోష, శాంతి, ఆనందాలు అన్నవి వెనువెంటగా, పరంపరగా లభ్యమయ్యేవి.

"ఆరోగ్యమే మహాభాగ్యం" అన్నారు పెద్దలు.

'ఆరోగ్యం' అంటే కేవలం శారీరకమైనదే కాదు, మానసికమైన, బుద్ధిపరమైన, ఆత్మపరమైన ఆరోగ్యాలు - ఈ విధంగా అన్నీ అవసరం! నిజానికి 'శారీరక ఆరోగ్యం' మానసిక ఆరోగ్యం పైనా, 'మానసిక ఆరోగ్యం' బుద్ధిపరమైన ఆరోగ్యం పైనా, 'బుద్ధిపరమైన ఆరోగ్యం' ఆత్మపరమైన ఆరోగ్యం పైనా పరస్పరం ఓ పరంపరగా ఆధారపడి వున్నాయి. ఈ విధంగా చూస్తే ఆత్మపరమైన ఆరోగ్యం అన్నింటికీ మూలమై ప్రధాన పాత్ర వహిస్తోంది, ఆరోగ్యదాయిక మానవ జీవితంలో.

ఏ మనిషి జీవితంలో 'ధ్యానం' లేదో, 'ధ్యాన భాగ్యం' లేదో, ఆ మనిషి జీవితంలో ఆత్మపరమైన ఆరోగ్యం శూన్యం! మరి అలాంటి పరిస్థితుల్లో బుద్ధిపరమైన ఆరోగ్యం కఠినం! మరి మానసిక పరమైన ఆరోగ్యం అసంభవం!

నూటికి తొంభైపాళ్ళు శారీరక అనారోగ్యాలు అన్నీ మానసిక ఆందోళనల జనితాలే! శారీరక ఆరోగ్యం లేకపోతే ఎంతటి సంపదలు వున్నా వాటిని అనుభవించలేం! శారీరక ఆరోగ్యం వుంటే ఏ సంపదలూ లేకపోయినా ఫర్వాలేదు! కనుకనే "ఆరోగ్యమే మహాభాగ్యం" అన్నారు.

"ధ్యానం వల్లనే ఆరోగ్యం; ఆరోగ్యం వల్లనే భాగ్యం!"

"ఆరోగ్యం భోగానికి దారి ; భోగం సంతోషానికి దారి!".

"ధ్యానమే సర్వరోగ నివారిణి; ధ్యానమే సర్వభోగ కారిణి".

"ధ్యానభాగ్యం లేకపోతే భౌతిక లోకంలో భాగ్యం" అన్నది లేదు !

# "ధ్యాన భేరి!"

ఆ పరమశివుడు 'ధ్యానా'నికి అంకితం!

'ధ్యాన'మే ఆ పరమశివుని జన్మస్థానం!

'ధ్యాన'మే ఆ పరమ శివుని గమనం !

'ధ్యానమే ఆ పరమశివుని సందేశం! శివుడు ముక్కంటి! అంటే "మూడు కన్నులున్నవాడు".

రెండు కన్నులు అందరికీ వుంటాయి.

ఆ మూడో కన్ను ధ్యానులకు మాత్రమే వుంటుంది.

ఈ మూడో కన్నే "ధ్యాన నేత్రం" - అదే "జ్ఞాన నేత్రం".

ఆ సదాశివుని చేతిలో 'ఢమరుకం' వుంటుంది.

ఆ 'ఢమరుకం' ద్వారా సదా ఆ పరమశివుడు 'ధ్యాన భేరి' ని మ్రోగిస్తూనే వున్నాడు-

'ఏమని?'

"అయ్యా! బాబూ! 'ధ్యానం' చేయండి! కళ్ళు రెండూ మూసుకుని కూర్చోండి ! వ్రేళ్లలో వ్రేళ్ళు పెట్టండి!" అని.

"శ్వాస మీద ధ్యాస' ను పెట్టండి! ఆనందమయులు కండి! 'శివులు' కండి" అని.

"సదాశివులు' అంటే 'సదానందమయులు' కండి 'పరమశివులు' అంటే 'పరమానందమయులు' కండి."

-ఇదే ఆయన మనకు ఇస్తున్న సందేశం!

ఇంకా ఆయన ఏమంటాడంటే ...... "నేను 'ధ్యానం' చేయడం లేదూ? నేను ధ్యానానికి కూర్చోవడం లేదూ? ధ్యానం మీరూ చేయండి . మీరూ కూర్చుంటే ఎంత బాగుంటుందో!"

"మీరూ జాగరణ చేయండి; మీరూ 'ధ్యానాన్ని ' విశ్వసించండి!"

ఈ విధంగా ఆ పరమశివుడు సదా మనకు తన దివ్య సందేశాన్ని అందిస్తూనే వున్నాడు.

సదా 'ధ్యాన భేరి' ని మ్రోగించడమే తన లక్ష్యంగా పెట్టుకున్న ఆ మహనీయునికి మన 'దివ్యచక్షువు'ని గురు దక్షిణగా ఇవ్వడమే ఆయన పట్ల మన సరియైన ప్రవర్తన! అదే సరియైన 'భక్తి' అదే సరియైన 'పూజ'!

అదే సరియైన 'ప్రార్థన'! అదే సరియైన 'సమర్పణ'!

మరి ఇంక మనమూ మ్రోగిద్దామా 'ధ్యానభేరి'ని ?

# "ధ్యానశక్తి"

సృష్టిలో వున్నదంతా శక్తే! ప్రతీదీ ఒకానొక ప్రత్యేక చైతన్య, ప్రాణశక్తి యొక్క పుంజమే!

నిజానికి స్థూలంగా కనపడే శరీరం మాత్రమే కాదు మనం! 'స్థూలం' అనే ముసుగును కప్పుకున్న శక్తి ముద్దలం!

ముసుగులో చీకటి వుంటుంది. ముసుగు తీసేస్తే అంతా వెలుగే! అప్పుడు వున్నదంతా ప్రాణశక్తి యొక్క అద్భుత ప్రకాశమే!

అప్పుడు వున్నదంతా ప్రాణశక్తి యొక్క చిత్ర, విచిత్ర వైభోగమే!

మనం "ముసుగులో వున్న వీరులం" అని తెలుసుకునే క్షణం మరి వచ్చేసింది!

ముసుగును ప్రక్కకు నెట్టే తరుణం మరి గబుక్కున ఏతెంచింది!

'ముసుగులోని వీరుణ్ణి' ప్రస్ఫుటం చేసే శక్తి ఒక్క ధ్యానానికే వుంది.

ధ్యానశక్తిని చేబట్టితే క్షణాల్లో 'ముసుగుభావం' తొలగిపోతుంది.

ధ్యానశక్తి వల్ల మన నైజం మనకు తెలసి మన ప్రాణశక్తి మరింత విజృంభిస్తుంది

ధ్యానశక్తి వల్ల మన సంకల్పశక్తి అపారంగా సంవృద్ధమవుతుంది.

సకల భువనలోకాల సృష్టికంతటికీ మూలం ఈ ధ్యానశక్తే!

మరి మానవుడిని 'మాధవుడి'గా చేయగలిగేది ఈ ధ్యానశక్తే!

అందరి ధ్యేయం 'ఆనందం' - 'ఆనందం' ఉన్నది 'సత్యం' లో ;

సత్యం విదితమవుతుంది 'ధ్యానం'లో - 'ధ్యానం' స్థితమవుతుంది 'శ్వాస'లో! నూరేళ్ళనుకుంటున్న మానవ జీవితాన్ని 'వెయ్యేళ్ళ చిరకాలపంట' గా కూడా చేయగలిగేదే ధ్యానశక్తి!

మానవుల అష్ట దరిద్రాల్నీ తొలగించి, మానవులకు అష్టసిద్ధులనూ కలిగింపచేసేదే ధ్యానశక్తి! ధ్యానశక్తి ధ్యాన సాధనతో ఉద్భవమవుతుంది; నిరంతర ధ్యాన సాధనతో అది ఉధృతమవుతుంది.

'ధ్యాన సాధన' అంటే 'ఆనాపానసతి - విపస్సన' సాధన.

ప్రజలందరినీ ధ్యానశక్తివంతులుగా చేయడమే "పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ, ఇండియా" వారి ఒక్కగానొక్క ధ్యేయం, వారి ఒక్కగానొక్క వజ్ర సంకల్పం.

అందరూ ఈ ధ్యానశక్తిని అందుకోవాలనీ, అందుకుంటారనీ, తమ వంతుగా తిరిగి అందరికీ అందిస్తారనీ, అంతటా విస్తరింపచేస్తారనీ ఆకాంక్ష

# "ధ్యాన జ్ఞాన సాధన"

మనిషి 'అల్పజ్ఞత' నుంచి, మహా విజ్ఞతకు చేరుకోవాలంటే, చేపట్టవలసినవే 'ధ్యాన జ్ఞాన సాధన'లు.

'ధ్యాన సాధన' అంటే, 'ఆనాపానసతి - విపస్సన' మార్గం.

'జ్ఞాన సాధన' అంటే, 'నా కష్టాలకు నేనే బాధ్యుడను', 'నా స్థితికి నేనే బాధ్యుడను'- అన్నవి తెలుసుకుని సదా జాగరూకులై ఉండడం.

ప్రతిరోజూ విధిగా ధ్యాన సాధన చెయ్యాలి, కనీసం ఒక గంటైనా!

మరి జ్ఞాన సాధన అన్నది, ఏ క్షణమూ మరచిపోకూడనిది!

ప్రపంచంలో మూడు వర్గాలవారున్నారు - 'సాధకులు కానివారు', 'సాధనలో వున్నవారు, మరి 'సిద్ధులైనవారు'.

సాధనలో లేని వారు తక్షణమే సాధకులుగా మారాలి.

సాధకులుగా ఉన్నవారు మరి రేపో, మాపో తప్పకుండా సిద్ధులౌతారు.

సిద్ధులైనవారు ఇంకా సాధకులుగా కాని వారందరినీ సాధకులుగా తయారు చేయాలి.

ఈ ప్రపంచంలో ప్రతి మనిషి సిద్ధుడుగా అవ్వాలి.

కనుక ప్రతి మనిషీ 'ధ్యాన జ్ఞాన సాధన' లలో నిమగ్నం కావాలి. అందరినీ, అంటే పిల్లలనూ పెద్దలనూ, స్త్రీలనూ, పురుషులనూ, చదువుకున్న వారినీ, చదువు లేని వారినీ - ఈ విధంగా అందరినీ ధ్యానయోగులు గా, జ్ఞానయోగులు గా మలచడమే "పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ, ఇండియా" వారి యొక్క ఏకైక ధ్యేయం.

  

# "ధ్యాన సాగరం"

'ధ్యానం'! 'సాగరం' రెండు అద్భుతమైన పదాలు! ఇక రెండూ కలిసితే ఇంకెంత బాగుంటుందో!

రెంటినీ కలిపితే వచ్చేదే 'ధ్యాన సాగరం'!

సాగరమంత గంభీరమైనది 'ధ్యానం', సాగరమంత విస్తారమైనది 'ధ్యానం'!

అన్ని భూమండలాలనూ కలిపేది 'సాగరం'!

సకల ప్రాణ కోటీ ఒకటని తెలిపేది 'ధ్యానం'!

సాగర గర్భంలో విచిత్రాతి, విచిత్రమైన మణులు!

మరి ధ్యాన పరాకాష్టలో అష్టసిద్ధులు!

'సంసార సాగరం'లో, అయోమయ పరిస్థితుల్లో, సుఖ దుఃఖాల మధ్య ఊగిస లాడుతూ, మరి నిరంతర అలల మధ్య తికమకపడుతూ వున్న మానవాళికి ఒక్క 'ధ్యాన సాగరమే శరణ్యం! ధ్యాన సాగరమే 'భవ సాగరం' నుంచి మనల్ని తరింపచేసే ఏకైక నౌక!

ధ్యాన సాధకులందరూ, మోక్షగాములందరూ, తప్పకుండా, విధి గా, విరివి గా 'ధ్యానసాగరం'లో మునగాలి!



# "ఆధ్యాత్మికత' అంటే?"

'ఆధ్యాత్మికత' అన్న పదానికి విపరీత పదం 'ప్రాపంచికత' !

'ప్రాపంచికత' అన్న పదానికి విపరీత పదం 'ఆధ్యాత్మికత'!

'కేవలం ప్రాపంచికత' అన్నది రేయి లాంటిదైతే 'ఆధ్యాత్మికత' అన్నది 'పగలు' లాంటిది.

'కేవలం ప్రాపంచికత'లోనే బ్రతుకుతున్న వారు చీకటిలో కొట్టుమిట్టాడు తున్నటువంటి వారు.

'ఆధ్యాత్మికత'ను సంతరించుకున్నవారు దివ్యమైన వెలుగులో చుట్టు పక్కలున్న వాటన్నింటినీ, మరి స్వంత మనస్సులో ఉన్నవాటినీ - అన్నింటినీ - యధార్థం గా అంటే, 'వున్నది ఉన్నట్టుగా', చూస్తూ అద్భుతమైన రమణీయతలో విహరిస్తూన్నటువంటి వారు.

రోజులు మారాయి! చీకటి రోజుల్ని ఇక ఈ భూమండలం లో వ్రేళ్లల్లో లెక్కించ వచ్చు!

ఇక ముందున్నది నిత్య పగలే! నిశీథికి సమాధి ఇక కట్టబడుతోంది!
'కేవలం ప్రాపంచికత' యొక్క అంతిమ ఘడియలు సమీపించాయి! 'ప్రాపంచికత' అన్నది 'బూజు పట్టిన పాత చింతకాయ పచ్చడి'! కేవలం.

'నామా'లు పెట్టుకోవడమే 'ప్రాపంచికత'

'నామా'లు తీసి వెయ్యడమే 'ఆధ్యాత్మికత'!

అయితే ఏ 'నామా'లు? నిలువు నామాలా? అడ్డ నామాలా?

నిలువు నామాలూ కాదు; అడ్డ నామాలూ కాదు! తీసివేయవలసింది 'నా', 'మా' లు!

'నా శరీరం', 'నా ఇల్లు', 'నా పిల్లలు',

'నా పొలం', 'నా వ్యాపారం', 'నా రాజ్యం' - ఇదే మానవుడికి పట్టిన 'చీడ'! అలాగే, 'మా జాతి', 'మా కులం', 'మా దేశం', 'మా వర్గం' - ఇదే మానవ జాతికి పట్టిన 'పీడ'!

ఆరువేల సంవత్సరాల క్రిందటే 'భగవద్గీత' లో శ్రీకృష్ణుడు "నిర్మమో నిరహంకారః" అని నెత్తీ, నోరూ బాదుకుని ఎన్ని విధాలుగా చెప్పినా వినే నాధుడు ఈ నాటికీ ఎక్కడా కనిపించట్లేదు!

ఇక నుంచీ 'నా' , 'మా' అనేవి తీసేసి 'మన' అని పెట్టుకుందాం!

# "దివ్యచక్షువు"

మనిషికి నాలుగు 'చక్షువులు' వున్నాయి-

మొదటిది 'చర్మ' చక్షువు - రెండవది 'మనో' చక్షువు-

మూడవది 'దివ'చక్షువు - నాల్గవది 'జ్ఞాన 'చక్షువు!

'దివ్య' చక్షువు అంటే 'ధ్యాన' చక్షువు - చిత్త వృత్తిరహితమైన పరిస్థితిలో వ్యక్తమయ్యేదే 'ధ్యాన-చక్షువు'.'ధ్యాన చక్షువే జ్ఞాన చక్షువుకి నాంది.'జ్ఞాన - చక్షువు' ను వికసించుకున్న వారే 'పురుషోత్తములు' లేక 'బుద్ధుళ్ళు'

మానవుడికి వున్న షట్చక్రాలలో ఆరవ చక్రం 'జ్ఞాన - నేత్రం' . ఆ జ్ఞానచక్రమే 'ధ్యానచక్షువు' స్థానం, అంటే 'భ్రూమధ్యం'.

ఈ 'ధ్యాన - చక్షువు' అనే 'దివ్య - చక్షువు' ఉత్తేజితం కావాలంటే ఆ స్థానం కిందే 'స్విచ్' వుంది అదే నాసిక! 'నాసిక' లో అటూ ఇటూ ప్రవహిస్తున్న వాయు ప్రవాహాన్ని గమనించడమే 'స్విచ్ నొక్కడం' అంటే. అదే 'ఆనాపానసతి'. అప్పుడు వెంటనే ఉత్తేజిత మవుతుంది 'ధ్యాన - చక్షువు'.

శివుడు 'ముక్కంటి' అంటే, పరిపూర్ణమైన దివ్య - చక్షువు గలవాడు; అంటే 'పరమ యోగీశ్వరుడు' అని అర్థం.

భూమి మీద పుట్టిన ప్రతి మానవుడూ ముక్కంటి కావాలి! అదే 'స్వధర్మం'! అదే 'స్వరాజ్యం'! అదే 'స్వతంత్రం'! అప్పడే స్వేచ్ఛ! అప్పడే 'స్వయంభూ'! అప్పడే 'స్వయంప్రకాశం'!.

అంతవరకూ పరాధీనులమే; పరాన్న భుక్కులమే; పరతంత్రులమే ! అంతవరకూ చీకటి రాజ్యమే; అంతవరకూ గుడ్డివాడు గుడ్డివాడికి త్రోవ చూపినట్లే; అంతవరకూ గ్రుడ్డి ఎద్దు చేలో పడినట్టే!

మరి త్వరపడుదామా ధ్యాన సముపార్జనకు? అంటే ధ్యాన అభ్యాసానికి ?

ఇక క్షణమైనా జాప్యం వద్దు!

గమ్యం తెలుసుకున్నాం, మార్గం తెలుసుకున్నాం. కనుక గమనం సాగిద్దాం.

గమ్యం 'దివ్య - చక్షువు'; మార్గం 'ఆనాపానసతి'; గమనం 'ధ్యాన సాధనం' - అంటే 'ధ్యాన అభ్యాసం'.

భూమండల వాసులందరినీ 'ధ్యాన నేత్రులు' గా చేయడమే "పిరమిడ్ స్పిరుచ్యువల్ సొసైటీ, ఇండియా' వారి ఒక్కగానొక్క ధ్యేయం, వారి ఒక్కగానొక్క వజ్ర సంకల్పం.

# "సూక్ష్మంలో మోక్షం!"

మనిషి ఒకటి కాదు రెండు. అవి 'దేహం', 'దేహి'.

ఒకటి స్థూలం, రెండవది సూక్ష్మం.

స్థూలం ప్రకృతిమయం - సూక్ష్మం పురుషమయం.

ఈ ప్రకృతి పురుషుల కలయికే జీవుడు; కనుక, జీవుడు 'ఒకడు' కాదు 'రెండు'.

అంటే, రెండుగా ఉన్న ఒకటి; అంటే ఒకటిగా ఉన్న రెండు; కనుక జీవుడు 'ద్వైతం', మరి అద్వైతం!

ఈ విషయం తెలుసుకోవడమే జ్ఞానం; తెలుసుకోలేకపోతే అజ్ఞానమే.

స్థూలంలో 'కామం', 'భోగం' ఉంటాయి;

సూక్ష్మంలో 'మోక్షం' ఉంది.

కేవలం స్థూలాన్నే దృష్టిలో పెట్టుకుంటే కామం, భోగం అన్నవి అప్పుడప్పుడూ మాత్రమే లభిస్తాయి. కానీ, సూక్ష్మాన్ని కూడా దృష్టిలో పెట్టుకుంటే ఈ కామం, భోగం అన్నవి శాశ్వతంగా ఉంటాయి. కనుక, మోక్షాన్ని సంపాదించుకున్న వారికే ఇహలోక భోగాలు నిజంగా, సంపూర్ణంగా ప్రాప్తిస్తాయి.

కనుక, "జీవుని యొక్క మొత్తం సంక్షేమం ఎందులో వుంది?" అంటే "ఈ జీవుడు ఒకటిగా ఉన్న రెండు" అని తెలుసుకోవాలి. అంటే స్థూలం, సూక్ష్మాల గురించి క్షుణ్ణంగా తెలుసుకోవాలి.

ఇదంతా ధ్యానం వల్లనే సాధ్యం; ధ్యానం ఆనాపానసతి వల్లనే సాధ్యం.



# "ఆత్మానుసంధానం!"

సదా ఆరోగ్యంతో బ్రతికేదే 'నిజమైన జీవితం'.

సదా సుఖంతో, ప్రశాంతితో వెలిగేదే నిజమైన 'జీవితం'.

సదా ఆనందంతో నృత్యంచేదే నిజమైన 'జీవితం'.

కనుక,

సదా సుఖ, ఆరోగ్యాలతో ఉంచగలగాలి భౌతికకాయాన్ని!

సదా ప్రశాంతితో ఉద్దీపనం చేయగలగాలి మనస్సును!

అయితే, స్వయం సిద్ధంగా ఆనందంతో అంతా వెల్లివిరిసి ఉన్నదే ఆత్మ!

'ఆత్మానుసంధానం' జరిగితేనే భౌతిక శరీరమూ, మనస్సూ రెండూ వారి సరిగ్గా ఉండేది;

'ఆత్మానుసంధానం' జరిగితేనే మనస్సు 'బుద్ధి'గా మారి పరిణామం చెందేది.

'ఆత్మానుసంధానం' అన్నది ధ్యానం ద్వారానే సిద్ధం.

'ధ్యానం' అంటే 'ఆనాపానసతి - విపస్సన' సాధనా మార్గం.

దేహ ఆరోగ్య సూత్రమే ధ్యానం!

మనఃశాంతి సూత్రమే ధ్యానం !

బుద్ధి వికాస సూత్రమే ధ్యానం !

సదా ఆరోగ్య, సుఖ, శాంతి, ఆనందాలతో వెలిగేవాడే

'భాగ్యవంతుడు' అంటే 'భగవంతుడు'!

సదా అనారోగి అయి, అశాంతిమయుడై, ఆనందరహితుడై

వుంటూ వున్నవాడే ప్రస్తుత మానవుడు.

మానవులు అందరూ 'భాగ్యవంతులు'గా అంటే 'భగవంతులు'గా మారి తీరాలి.

అందుకుగానూ ...

చేద్దాం మనం అందరం ధ్యానం ..

చేయిద్దాం మనం అందరిచేతా ధ్యానం ..

మరి ఇదంతా ..

ఇప్పడే ! ఈ జన్మలోనే ! అంతేకానీ, మరో జన్మలో కాదు!

## "జయోస్తు - విజయోస్తు !"

ప్రతి మనిషికీ కావలసినది -

ప్రతి దానిలోనూ 'జయం'! కాదు 'విజయం'!!

విశేషమైన జయాన్ని 'విజయం' అంటాం.

పుట్టే ముందర ప్రతి మానవుడూ "ఈ సారి అయినా జీవితమంతా

విజయవంతంగా జీవిస్తా"ననే దృఢనిర్ణయం తో, "అలానే జీవించగల"ననే ఆత్మ విశ్వాసం తోనే పుడతాడు.

అయితే,

ఎందుకీ అపజయ పరంపర ? ఎందుకీ జయ శూన్యత ? ఎందుకీ విజయ లేమి ?

కానీ, అక్కడక్కడా కనిపిస్తూ ఉంటారు

పట్టిందంతా బంగారం అయినవాళ్ళూ,

అపజయ ఛాయలే చూడని వారూ,

స్వచ్ఛంద మరణమే తప్ప బలవంతపు మరణం లేనివారూ!

ఇంత అర్థం వుంది -

"పురుషుల్లో పుణ్య పురుషులు వేరయా" అన్న వేమన నుడివిలో!

'పుణ్య పురుషుల' కాని వారికి తప్పదు

అపజయ పరంపర, జయ శూన్యత, మరి విజయ లేమి.

ఎవరైతే పుట్టుకతోనే మహా పుణ్యపురుషులో,

అంటే తమ జన్మ పరంపరలో చివరి స్థాయిలో వున్నారో, వారికి మటుకే

చేపట్టిన ప్రతి పనిలోనూ సునాయాసంగా జయాలూ, విజయాలూ లభిస్తాయి.

'అంతగా పుణ్యపురుషులు' కాని వారికి కానీ, మరి 'పాపచరితులకు' కానీ జయ, అపజయాలు అన్నవి రాత్రి - పగలూలాగా ఒకటి తరువాత ఒకటి పరంపరగా వచ్చేవే.

మరి అపజయాలు అన్నమాటే లేకుండా అన్నీ విజయాలే పొందాలంటే -

పుణ్య విశేషం లేకుండా పుట్టిన వారు విధిగా విశేషమైన పుణ్యాన్ని ఈ జన్మలో సరి క్రొత్తగా చేకూర్చకోక తప్పదు.

ఏమిటి 'విశేష పుణ్యం' అంటే ? ... అదే,

'జ్ఞాన దానం!', 'ఆత్మజ్ఞానదానం!'

ఎవరైతే ధ్యానమనే అద్భుత సాధన ద్వారా ఆత్మజ్ఞాన మూర్తులై వికసించి, తమ సౌరభాన్ని అందరికీ వెదజల్లి ఇతర్లందర్నీ కూడా ఈ ధ్యాన, ఆత్మజ్ఞానాదుల పట్ల ఆకర్షితులను చేస్తారో..

అలాంటి వారే "విశేష పుణ్య పురుషు"లై

అతి సునాయాసంగా తాము చేపట్టిన ప్రతి పనిలోనూ "జయులు", "విజయులు" అవుతారు.

ఇదే "ధ్యాన విజయం".



# "దసరా - సరదా!"

దసరా నవరాత్రులలో మనం ఉన్నాం ప్రస్తుతం!

దసరా పండుగలు "దుర్గాదేవి"కి అంకితం.

"దుర్గాదేవి" అంటే "శక్తి స్వరూపిణి" అని అర్థం.

దేనికైనా "శక్తి" మూలం.

మన లోపల వున్న శక్తి క్షీణిస్తే ఏమీ చేయలేం.

కానీ, మనలో వున్న శక్తి విజృంభిస్తే అన్నీ చేయగలం.

శక్తి ఉంటేనే సరదాలు; శక్తి లేకపోతేనే నీరసాలు.

ఎప్పుడో పాత కాలంలో ఒకావిడ "శక్తి స్వరూపిణి" అయింది - ఎలా?

ఏ సాధన చేసిందావిడ? ఏం చేసి, ఏం సాధించుతోంది?

"శక్తి" ఆవిడ సొంతమా?

"శక్తి" ఆవిడ ఒక్కత్తి స్వరూపమా?

ప్రతి ఒక్కరూ సదా శక్తి స్వరూపులు కావచ్చు - అవ్వాలి!

"దుర్గం" అన్నది అభేద్యమైనది. మనలో శక్తి ఎంత ఉంటే అంత అభేద్యం మనం; శక్తి లేకపోతే ఛేదింపబడతాం.

శక్తిని సంతరించుకుంటే ఛేదింపబడం; వర్జింపబడం.

"ఆనాపానసతి - విపస్సన" మార్గమే మనలను మనం శక్తి స్వరూపులుగా చేసుకునే మార్గం.

అదే మనలను మనం అభేద్యమైన 'దుర్గ'లుగా మలచుకునే విధానం.

అప్పుడు నవరాత్రులేం ఖర్మ?

"ప్రతి రాత్రీ దసరాయే - ప్రతి రోజూ సరదాయే"!



# "రామరాజ్యం!"

మనం అనాది నుంచీ భారతదేశంలో "రామరాజ్యం" గురించి వింటూ వున్నాం. ప్రతి యుగం లోనూ ప్రజలు "రామరాజ్యం" కోసమే కలలు కన్నారు.

"రామరాజ్యం" అంటే ఒక రాముడి లాంటి వాడి చేతిలో నడవబడే రాజ్యం.

ప్రజల యోగక్షేమాల గురించి పూర్తిగా తెలిసివున్న రాజు చేతిలోని రాజ్యం.

ఒక రాజు మహాయోగి అయిన పరిస్థితిలో వున్నటువంటి రాజ్యం.

ఆధ్యాత్మికతోనే పుట్టి, ఆధ్యాత్మికతలోనే పెరిగి ఆధ్యాత్మికత కోసమే జీవించిన యోగి రాజు చేతిలో నడుపబడిన రాజ్యం.

"రాముడు" వంటి వాడు రాజు కాకపోతే "రామరాజ్యం" రావడం అనేది అసంభవం!

అందుకే "సోక్రటీస్" మహానుభావుడు కూడా అన్నాడు-

"తత్త్వవేత్తలే పాలకులు కావాలి" అని.

ప్రజలు "రామరాజ్యం" కోరుకునేటట్లయితే ఆత్మజ్ఞానులనే పరిపాలకులుగా ఎన్నుకుని తీరాలి.

ప్రజలు మూర్ఖుల్ని ఎన్నుకుంటే ఆ మూర్ఖులు ప్రజల్ని "మిరపకాయ బజ్జీ"లు చేసుకుని తింటారు.

"ఎవరి వాస్తవాన్ని వారే సృష్టించుకుంటారు" అన్నది పరమ సత్యం.

"రామరాజ్యం" కావాలో "రావణ రాజ్యం" కావాలో ఎన్నుకునేది ప్రజల చేతిలో వుంది.

"యధా రాజా తధా ప్రజా" అన్నది ఎంత సత్యమో,

"యధా ప్రజా తధా రాజా" అన్నది కూడా అంత సత్యం!

"పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ, ఇండియా" ప్రజలందరినీ ధ్యాన ప్రజలుగా,

ఆత్మజ్ఞాన సంపన్నులుగా తీర్చిదిద్దుతోంది. ఆత్మజ్ఞానులైన ప్రజలు తప్పకుండా ఆత్మజ్ఞానుల్నే నాయకులుగా ఎన్నుకుంటారు.

ఆ రోజు చాలా దగ్గరలోనే ఉంది. మళ్ళీ "రామరాజ్యం" వచ్చి తీరుతుంది.

ఎందుకంటే - మళ్ళీ ఈ నవీన యుగంలో - భారతదేశంలోనే కాదు.

ప్రపంచం అంతా కూడా "రామరాజ్యం" అనేది వెల్లివిరుస్తుంది.

భారతదేశంలోనే కాదు, ప్రపంచ వ్యాప్తంగా కూడా "రామరాజ్య స్థాపన"కు అంకితమవుదాం.

సర్వత్రా ఆధ్యాత్మిక విజ్ఞాన విస్ఫోటనానికి నిరంతరం కృషి చేద్దాం.

# "ఆత్మజ్ఞానం"

భూలోకానికి జన్మ తీసుకుని వచ్చిన ప్రతి మానవునికీ, ఆ జన్మ వెనుక ఒక కారణం ఉంటుంది.

కారణం లేకుండా ఇక్కడకి రావలసిన అవసరం ఎవ్వరికీ లేదు.

ఈ భూలోకంలో మనం అన్నీ నేర్చుకుంటూ, అందరికీ నేర్పడానికి వచ్చాం.

అయినా, తప్పని కర్తవ్యం మాత్రం ఆత్మజ్ఞాన సముపార్జన. ఇది ఎలా ? ఎక్కడ దొరుకుతుంది? ఎక్కడా దొరకదు! మనకు మనమే ప్రతి నిత్యం సాధన చేసి సంపాదించు కోవాలి.

"కష్టే ఫలే" అన్నారు కదా! ప్రతి నిత్యం సాధన చేసి 'ఆత్మజ్ఞానం'ను పొందాలి.

సాధన ద్వారా సాధ్యం కానిది ఏమీ లేదు.

'సాధన' అంటే ఏమిటి ? 'ధ్యానం'! ఉశ్చ్వాస నిశ్వాసలను గమనిస్తూ ఉన్నప్పుడు ఆలోచనా - రహిత - స్థితి వచ్చిన తరువాత అనుభవాలు వస్తాయి. ఊర్ధ్వ లోకాలలో ఉండే 'పూర్ణాత్మ'ల నుంచి 'జ్ఞానం' లభిస్తుంది. పూర్ణాత్మల నుంచి నేర్చుకున్న జ్ఞానమే 'ఆత్మజ్ఞానం' అంటే.

'ఆత్మజ్ఞానం' అనేది మూడు విధాలుగా సమకూర్చుకోవాలి. మరి ఈ జన్మను ఆఖరు జన్మగా చేసుకోవాలి అంటే తప్పవు మరి అవి :

1) ధ్యానం

2) సజ్జన సాంగత్యం

3) పుస్తక పఠనం.

ప్రాపంచికంగా మనం ఏం సంపాదించినా, ఏవి సాధించినా అవన్నీ అశాశ్వతమే. అందుకే శాశ్వతమైన దాని కోసం తపన పడాలి. పోరాడి సాధించాలి. ఈ జన్మను ఆఖరు జన్మగా చేసుకోవాలి. లేదంటే మళ్ళీ పుట్టడం, మళ్ళీ చావడం. ఇలా పుడుతూ, చస్తూ కొన్ని వందల జన్మలను ఇప్పటికే వ్యర్థం చేసుకున్నాం. ఇంకా ఎన్ని జన్మలు ఇలా ఉంటాం ? ఇక చాలు ! ఈ జన్మనే ఆఖరు చేసుకుందాం. "ఈ సారి చావు అంటూ వస్తే మళ్ళీ చనిపోవలసిన అవసరం లేకుండా ఉండాలి". ఈ విధమైన దృఢ సంకల్పంతో ఈ క్షణం నుంచి జీవిద్దాం.

# "ఉన్నవి రెండే!"

'భక్తి' అనేది 'యోగం' కాదు - 'రోగం'!

'కర్మ' అనేది 'యోగం' కాదు - 'ధర్మం'!

'జ్ఞానం' అనేదే యోగం - అదే 'జ్ఞాన యోగం'!

'ధ్యానం' అనేదే యోగం - అదే 'రాజ యోగం'!

రోగాన్ని తీసేయండి!

ధర్మాన్ని నిత్యం ఆచరించండి!

యోగ సాధన చేయండి!

జ్ఞాన యోగ సాధనా మార్గాలు రెండు :

ఒకటి - స్వాధ్యాయం; రెండు - సజ్జన సాంగత్యం.

"త్రిజగతి సజ్జన సంగతి రేకా

భవతి భవార్ణవ తరణే నౌకా!"

అన్నారు ఆదిశంకరాచార్య -

"తపః స్వాధ్యాయ ఈశ్వర ప్రణిధానేన క్రియా యోగః"

అన్నారు పతంజలి -

రాజయోగ మార్గం ఒక్కటే - అదే "ఆనాపానసతి"!

ఉన్న యోగ మార్గాలు రెండే!

వాటి సూత్రాలు రెండే!

ఏ లోకంలోనైనా - ఏ కాలంలో నైనా

జ్ఞానయోగ సూత్రం - "మీ వాస్తవానికీ, మీ స్థితిగతులకీ మీరే సృష్టికర్తలు"అని-

ధ్యాన యోగ సూత్రం - "శ్వాస మీద ధ్యాస, అదే ఆనాపానసతి".

ఉన్నవి రెండే!

ఉన్నవి రెండే!

# "ఓషో రజనీష్ !"

ఈ భూమండల 21వ శతాబ్దపు ఆధ్యాత్మిక విప్లవంలో

ఓషో ఒక కోహినూర్ వజ్రం!

ముఖ్యంగా భారతదేశంలో ఇంతటి

వైజ్ఞాన మూర్తి పుట్టటం అనేది ఆశ్చర్యకరమైన విషయం!

మూర్ఖ ఛాందస భావాలు గూడు కట్టుకుని వున్న

భారతీయులకు భావ సంపదనూ,

విశాల దృక్పథాన్నీ, అరమరికలు లేని దైనందిన జీవన పద్ధతినీ

నిరూపణగా ప్రదర్శించిన అభినవ జ్ఞాన భగీరథుడు రజనీష్ !

ధ్యాన ప్రాశస్త్యాన్ని దశదిశలా ప్రాకించిన నవ్య ధ్యాన బుద్ధుడు రజనీష్!

భౌతిక జీవన సుమధుర సౌరభాన్ని చిలువలు పలువలుగా వివరించిన ఇహలోక శాస్త్రవేత్త రజనీష్!

తన అపార నాటకపటిమతో, సహృదయతతో, లోకజ్ఞానంతో, స్వేచ్ఛానిరతితో ప్రపంచాన్నే ఉర్రూత లూగించిన లోక నాయకుడు రజనీష్!

వింటే రజనీష్ వాణినే వినాలి!

"తింటే గారెలే తిన్నా తినాలి, వింటే భారతమే వినాలి"...

అన్నది ఒకప్పుడు మనం చెప్పుకున్నా ఇప్పుడు మనం దాన్ని తిరగ వ్రాయాల్సి వస్తుంది. "తింటే గారెలే తినాలి; వింటే రజనీష్ వాణినే వినాలి" అని ఇప్పుడు మనం ఈ నవీన యుగం లో చెప్పుకోవాలి.

రజనీష్ మహాత్ముడు వ్రాసింది 'చిగురంత', ప్రవచించింది 'హిమాలయాలంత' ! ఆయన పుస్తకాలన్నీ , సుమారుగా 650 , ఆయన ప్రవచనాలను యథాతథంగా మన ముందర ఉంచినవే.

ఆయన అసమాన, మృదుమధుర వాణి అనేకానేక ఆడియో కాసెట్స్, మరి వీడియోల ద్వారా మనకి మధురాతి మధురంగా వినిపిస్తుంది.

రజనీషామృతాన్ని గ్రోలని వాళ్ళు మహా దురదృష్ట జాతకులు!

అసలయిన సిసలయిన ఆత్మజ్ఞానానికి ప్రతిబింబం ఓషో రజనీష్ !

"జీవితం ఇలా జీవించాలి" అని అద్భుతంగా సుమారు 60 యేళ్ళగా జీవించి చెప్పినవాడు!

రజనీష్ తో ఓ అద్భుత క్రొత్త యుగం ప్రారంభమయింది - ఈ భూమి యొక్క పూర్ణ ఆధ్యాత్మిక చరిత్రలోనే!

రజనీష్ మాటలు వింటేనే మోక్షం!

రజనీష్ ముఖం చూస్తేనే ఆత్మ సంతృప్తి! మనిషికీ, మనిషికీ మధ్య వున్న గోడలన్నీ సమూలంగా పెరికివేసిన అసామాన్య సామాజిక వాది రజనీష్!

మతానికీ - మతానికీ మధ్య వున్న అర్థరహిత తేడాలను నిష్కర్షగా తెగనాడిన మహాప్రవక్త రజనీష్!

జాతికీ - జాతికీ, దేశానికీ - దేశానికీ మధ్య వున్న

సరిహద్దులను చెరిపేసిన నవ్య రాజకీయ యుగకర్త రజనీష్!

పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ ధ్యానుల, మాస్టర్ల అత్యంత ప్రియతమ ఆదర్శమూర్తి రజనీష్!

ఇంకెంత వ్రాయనూ ? చేతులు నొప్పి పుడ్తున్నాయి!



# "అన్నమయ్య"

అన్నమయ్య గొప్ప యోగి, గొప్ప జ్ఞాని.

ఆత్మానుభవం ఉన్నవాడు; ఆత్మానందాన్ని లెక్కలేనంతగా గ్రోలినవాడు.

సూటి అయిన ధ్యాన జ్ఞాన విషయాలను సాటిలేని విధంగా చెప్పినవాడు.

ఆనాపానసతి ధ్యాన విధానాన్ని ఆయన ఈ విధంగా తన మాటల్లో కూర్చాడు.

*"కాయపుటూపిరి లోనే గని ఉన్నది"-*

*"ఊపిరిలో దేవుడు ఉన్నాడు యోగీంద్రులకు"*

"యోగీంద్రుడు అవ్వాలంటే ఊపిరిని గమనించి తీరాలి" అన్న అసలైన ధ్యాన సూత్రాన్ని సూటిగా ప్రకటించిన యోగీంద్రుడు అన్నమయ్య! చిత్తాన్ని అంతర్ముఖం చేసుకోవాలని ఆయన హెచ్చరించారు. కనుకనే ఆ యోగి అన్నాడు-

*"చిత్తమంతర్ముఖం చేసుకొన నేర్చెనా అత్తలనతడు 'యోగి' అనబడును".*

*"అంతా మనలోనే ఉంది"* అని ఆయన స్పష్టంగా వ్యక్త పరచారు.

ఉదాహరణకు, *"పుష్పతి గొలువలేక నొద్ద నుండగా కొందరు మిన్ను మీద వెదికేరు మితిమీర జదివి".*

ఆధ్యాత్మికతలో ఎదగడానికి కొంత అయినా వైరాగ్యాన్ని అలవరచుకోక తప్పదు. రోజుకి ఉన్న 24 గంటల్లో కనీసం రెండు, మూడు గంటలయినా బయటి సంగతులు మరచిపోవాలి. *"లో చూపు అలవరచుకోవాలి'* అని అన్నారాయన. "ఎంతసేపూ బాహ్య ప్రపంచ జ్ఞానానికే ప్రాముఖ్యతను ఇస్తే, ఆత్మజ్ఞానం కలగదు" అని నొక్కి చెప్పిన ఆత్మజ్ఞాని అన్నమయ్య ! అందుకే అన్నారు ఆయన -

*"వెలుపల మరువక లోపల లేదు; వెలుపల గలిగిన లోపల మరచు;*

*వెలుపలి వెలుగే చూడగ లోపలి పెడ చీకటి గానని యట్లు*

*అలగ ప్రపంచ జ్ఞానికి దనలో నాత్మజ్ఞానం గానరాదు!*

*అలయుక తనలో చూపు చూచినను అంతరంగమున హరిగనను".*

"ఈ భూలోకంలోనే ఏదైనా సాధించాలి. అన్ని లోకాలకూ దారి ఈ భూలోకం నుంచే ఉంది" అని సర్వలోకాల గురించీ వివరించిన బ్రహ్మజ్ఞాని అన్నమయ్య.

"ముక్తులై యుండినవారు, సురలై యుండినవారు

యిక్కడి నుండి పోయిన యీ జీవులే.....

పాతాళవాసులును, పలులోకవాసులును

యీ తరువాత నుండిన యీజీవులే".

వ్యర్థ జపాలనూ, పూజలనూ ఆయన తిరస్కరించారు.

"పరతంత్ర బానిస భావాల ద్వారా"నే మనిషి తన దారిద్ర్యాన్నీ, దుఃఖాన్నీ, బాధలనూ వ్యాధులనూ, జనన - మరణాలనూ అనుభవిస్తున్నాడనే రహస్యాన్ని బట్టబయలు చేసిన ఆధ్యాత్మిక విజ్ఞాన ఖని అన్నమయ్య! అందుకే అన్నాడు-

*"తానే దైవమైతే తపమేల జపమేల? పూని సారె బూజించే పూజలేల?*

*తగదా స్వతంత్రుడైతే దరిద్ర దుఃఖములేల?*

*నొగిలి వ్యాధుల చేత నొవ్వనేల?*

*నగుబాటులైన జననమరణములేల?"*

వేంకటేశ్వరస్వామి నడిచిన బాటలో అన్నమయ్య నడిచాడు. అన్నమయ్య నడిచిన బాటలో మనమూ నడుద్దాం. ఇదే పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ ధ్యానులందరి ధ్యేయం. అప్పుడే పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ ధ్యానులు అందరూ "పరిపక్వ ధ్యానులు" గా అయ్యేది.

"యోగం ద్వారానే యోగ్యత - ధ్యానం ద్వారానే ధన్యత"!.



# "అడవి గాచిన వెన్నెల!"

వేమన 'తెనుగు అడవి' న గాచిన వెన్నెల!

వేమన గురించి తెలియం దెవ్వరికి?
వేమన గురించి తెలిసిందెవ్వరికి ?
'యోగి వేమన' అని కీర్తిస్తున్నాం!
కానీ, మనం స్వయంగా 'యోగి' గా ఉత్సుకించం!
వేమన సూక్తులను స్కూళ్ళల్లో పాఠ్యాంశాలుగా చేస్తాం,
కానీ, ఆయన చూపిన వెలుగులో మాత్రం మనం జీవించం!
అయితే, పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ ధ్యానులకు వేమన ఆదర్శమూర్తి.
పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ మాస్టర్లకు
వేమన స్వంత గూటి పక్షి!

ఆస్తిక మూర్ఖులైన మూర్తిపూజా దురంధరులకు
వేమన సింహస్వప్నం! గొంతులో పచ్చివెలక్కాయ!
మత ఛాందసులకూ, సాంఘిక దురాచారులకూ అయన ఓ కొరడాదెబ్బ!
మెట్ట వేదాంత 'పండిత' శిఖామణులకు అతను ఓ కొరకరాని కొయ్య!

ప్రతి పిరమిడ్ ధ్యానీ ఓ 'వేమన' అవ్వాలి.
అదే విధంగా నిర్భయం గా, నిస్సంకోచంగా

సత్యాన్ని కుండ బద్దలు కొట్టేసట్లు చాటి చెప్పాలి!
ఎవ్వరివద్దా సంగసవసరం లేదు! ఎవ్వరినీ లెక్కపెట్టనవసరం లేదు!
మూర్ఖులను మూర్ఖులుగా అభివర్ణించాల్సిందే!
మూర్ఖులను తిరస్కరించి తక్షణం చెత్త బుట్టలో పడేయాల్సిందే!
అసత్యాన్ని తరమాల్సిందే!
అంతే ! అంతే!! అంతే!!!
ఇకనైనా మేల్కొందాం! ఇకనైనా తప్పులను సరిదిద్దుకుందాం!
ఇంతవరకూ అడవి గాచిన ఈ 'వేమ వెన్నెల'ను
ఇప్పుడైనా గ్రామాలకు తీసుకువెళ్దాం! నగరాలలో ప్రచారం చేద్దాం!

# "ఆదర్శ యోగి శిరిడీ సాయి"

**20** వ శతాబ్దిలో ఓ "శిరిడీ సాయి యుగం" దక్షిణ భారతదేశంలో వెల్లి విరిసిందన్నది నిర్వివాదాంశం! నిజమైన ఆధ్యాత్మికతను మహారాష్ట్రలోని ఓ మారుమూల కుగ్రామం లోంచి అందరికీ జీవించి నిరూపించిన పరమయోగి శ్రీ శిరిడీ సాయి.

ఆయన ఎందరినో తాను భౌతికంగా వున్నప్పడూ, మరి ఆ తర్వాత కూడా ఆదుకుని, ఇంకానూ ఆదుకుంటూ వున్నారు. అయితే ఆయన ఎలా సాధించగలిగారు అలాంటి అమేయ శక్తిని? ఏ విధంగా తాను ఓ 'పరమ ఆత్మ', కాగలిగాడు? ఏ చదువులు చదివాడు - ఆ అపార జ్ఞానాన్ని సంతరించు కోగలగడానికి? 'శిరిడీ సాయి'గానీ, 'వీరబ్రహ్మేంద్ర స్వామి' గానీ, 'మంత్రాలయ రాఘవేంద్ర స్వామి' గానీ, మరెవ్వరైనా గానీ, ఆ యా స్థాయిలకి చేరుకోగలిగారంటే అది వారి అంకురిత ధ్యాన యోగసాధన ద్వారానే అని ఖచ్చితంగా చెప్పాలి

ధ్యానయోగ సాధన ద్వారానే అందరూ యోగులవుతారు!

యోగులయినవారే యోగ్యులు! ధ్యానం చేసినవారే ధన్యులు! తాను స్వయంగా యోగి అయినవాడూ, తాను ధన్యుడు అయిన వాడూ "ఇక అందరూ యోగులు కావాల"నే కోరుకుంటాడు. "ఇక అందరూ ధన్యులు కావాల"నే వాంఛిస్తాడు. ఇదే శిరిడీ సాయి కానీ, మరే యోగి కానీ మన దగ్గర నుంచి కోరుకునేది.

మనం కూడా వారిలాగా యోగులుగా అయి స్వయంగా చేసి చూపించటమే వారి పట్ల మనకున్న పూజాభావాన్నీ వారి పట్ల మన విధేయతనూ ప్రకటించడమంటే. అంతేకానీ వారిని అంతులేని కోరికల తో సమస్యల తో సదా విసిగించడం కాదు.

మనం పాపకర్మలు సదా చేస్తూ వుంటాం. "ఓ శిరిడీ సాయీ! పాహిమాం! నాకు కొడుకును ప్రసాదించు! నా అప్పులు తీర్చు! నాకు ఉద్యోగం కావాలి! పెళ్ళి కావాలి!"..

అని నిరంతరం అప్పలవాడిగా వెంటబడకుండా, పాపకర్మలు చెయ్యడం పూర్తిగా మానేసి మనమూ ఆయనలా యోగి కావడానికై నిశ్చయించాలి.

అఖండమైన 'ఖండ యోగి' శిరిడీ సాయి!

అష్టసిద్ధులనూ హస్తగతం చేసుకున్న 'సిద్ధుడు' శ్రీసాయి!

ఏకమైన ఆత్మతత్వాన్ని తదేకంగా జీవించిన 'ఆత్మజ్ఞాని' శ్రీసాయి!

ఆయనలా మనమూ కాగలగడమే మనం అయనకు ఇవ్వగలిగిన నివాళులు. ఇప్పుడైనా యోగసాధనకు పూనుకుందాం ! వేరే మార్గ మేముంది ? వారు ఏం చేస్తారో మనమూ అదే చేయాలి! వారి అంత వారం మనమూ కావాలి! అప్పడే ఆయన సంతోషం తో గంతులేస్తారు! అప్పడే ఆయన మన కోసం పడిన కష్టాలకు సార్ధకత! కేవలం ఆయన నామాన్ని స్మరిస్తూ జీవితం గడిపితే ఆయన హర్షిస్తాడా? ఎంత మాత్రం కాదు!

నామాన్ని స్మరించడం ద్వారా ఎవ్వరూ యోగులు కాలేదు. 'త్యాగరాజ' నామస్మరణ ద్వారా ఎవ్వరూ 'సంగీతజ్ఞులు' గా కాలేదు! కాస్త ఇంగిత జ్ఞానం, కాస్త కామన్ సెన్స్‌లను ఉపయోగిస్తే ఎవ్వరికైనా ఈ మాత్రం సులభంగా బోధపడుతుంది.

సాయి జీవిత చరిత్రను 'నిత్య పారాయణ' కాదు చేయవలసింది. ఒక్కసారి 'అధ్యయనం' చేస్తే చాలు! ఇక నిత్యమూ చేయవలసింది 'యోగసాధన'! 'నిత్య పారాయణ' కు స్వస్తి చెప్పి 'నిత్య యోగసాధన' కు నాంది పలకాలి. అదే శ్రీ శిరిడీ సాయి కోరుకునేది.

పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ ధ్యానులందరికీ శ్రీ శిరిడీ సాయి లెక్కలేని ధ్యానానుభవాలతో చెప్పిన సారాంశమిదే. 'శిరిడీ సాయి భక్తు'లవ్వడం మానేసి ఆయన 'శిష్యుల' మవుదాం. శిష్యరికం చేసి మనమూ గురువులుగా అవుదాం !

ఎలాగైతే ప్రతి తల్లీ, ప్రతి తండ్రీ తమ బిడ్డ పెరిగి తమంతట అయి, యోగ్యుడై, తమకంటే ఎంతో ఉన్నతస్థాయిని చేరాలని ఏ విధంగా కోరుకుంటారో, ఎలాగైతే ప్రతి విత్తనమూ ఏ చెట్టులోంచి వచ్చిందో, తానూ అంతటి చెట్టు లాగా ఎదగడానికి కృషి చేస్తుందో, కృషి చెయ్యాలో, అదే విధంగా పరిణతి చెందిన మహాత్ములూ, పరమాత్ములూ ప్రతి మనిషి కూడా అదే విధమైన పరిణతి చెందాలనే వాంఛించి అందుకోసమే అనుక్షణమూ ప్రయత్నిస్తారు. అందుకు ఫలాన్నీ, పత్రాన్నీ, పుష్పాన్నీ దేనినీ కోరరు. వారికేం అవసరం వీటితో?

మన సమస్యల నుంచి మనలను బయటవేసే శక్తి వారెవరికీ లేదు. ఎవరి శక్తి వారిలోనే వుంది! అది బయటకు తీసే విధానం మనకు తెల్పడమే వారు మనకిచ్చిన వరం."ఉద్ధరేదాత్మనాత్మానం" అన్నాడు కదా శ్రీ కృష్ణుడు భగవద్గీతలో! ఆ వాక్యానికి

తిరుగు వుందా? ఎవరిని వారే ఉద్ధరించుకోవాలి. ఏ యుగంలో నైనా! ఏ దేశంలో అయినా! ఏ పరిస్థితుల్లోనైనా!

ఇకనైనా మేల్కొందాం! శిరిడీ సాయి చెప్పిందొకటి, మనం చేసేది మరొకటి! ఇకనైనా ఈ శోచనీయమైన స్థితికి తిలోదకాలిద్దాం.

ధ్యానం చేద్దాం!

'ధ్యానం' అంటే 'నామస్మరణం' కాదు. ధ్యానం అంటే 'శ్వాస మీద ధ్యాస'!

ధ్యానం అంటే ఆనాపానసతి, తద్వారా దివ్యచక్షువు ఉత్తేజితం!

ఫలితంగా జ్ఞానచక్షువు పరిపక్వత!

హే సాయినాథా! మేమంతా నీలాగా ఈ జన్మలోనే తయారయి ఈ భూమిని మాస్టర్స్‌తో నింపుతాం! ధ్యాన, స్వాధ్యాయ, సజ్జన సాంగత్యాలనే ఆయుధాల నిత్య ప్రహారం ద్వారా భువి ని దివిగా మలుస్తాం!



# "పరమ గురువు శ్రీ జీసస్ క్రైస్ట్!"

గత 2000 సం॥గా ఈ భూమండలం అంతా పరమగురువు శ్రీ జీసస్ క్రైస్ట్ యొక్క పరమ అద్భుతమైన ప్రవచనాల పరిమళాలతో నిండి ఉన్నా, ఆయన ప్రభోధనలలోని అసలు తత్త్వాన్ని మాటుకు చాలా కొద్ది మందే గ్రహించి ఉన్నారు.

జీసస్ క్రైస్ట్ చెప్పింది ఒకటి, 'క్రిస్టియన్స్' చేస్తున్నది మరొకటి! పరమ గురువు శ్రీ జీసస క్రైస్ట్ ప్రభోధనలతో ఇంతమంది క్రిస్టియన్స్ నిజంగానే జీవిస్తూ ఉంటే ఈ భూమండలం ఇంత దౌర్భాగ్యస్థితిలో ఎలా ఉంటుంది ?

పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ ధ్యానులే నిజమైన క్రిస్టియన్స్ ! "పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ ధ్యానులు" అంటే ప్రస్తుతం ప్రపంచ వ్యాప్తంగా ఉన్న "న్యూ ఏజ్ మూవ్‌మెంట్"లోని ఈ ప్రాంతపు భాగస్వాములన్నమాట. ప్రపంచంలోని ఈ న్యూఏజ్ విద్యార్థులే, ఈ న్యూ ఏజ్ మాస్టర్లే నిజమైన క్రిస్టియన్లు, నిజమైన హిందువులు, నిజమైన మహ్మదీయులు, నిజమైన జొరాస్ట్రియన్‌లు, నిజమైన బౌద్ధులు, నిజమైన జైన్‌లు.

ఆధ్యాత్మిక శాస్త్ర విజ్ఞాన అనుభవ ప్రకారంగా ఒక గురువు చెప్పింది మరొక గురువు చెప్పిన దానికన్నా విభిన్నంగా ఎప్పుడూ ఉండజాలదు. ఏ లోకంలోనైనా శాస్త్రజ్ఞానం ఒక్కటిగానే ఉంటుంది. "ఏకం సత్, విప్రాః బహుధా వదంతి" అన్నారు కదా!

పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ మాస్టర్లు ప్రతి ఒక్కరూ ఒక జీసస్ క్రైస్ట్‌లా, ఒక బుద్ధుడుగా తమను తాము తీర్చిదిద్దుకోవాలి. అదే పై లోకాలలో ఉన్న ఆ జీసస్, ఆ బుద్ధుడు మన నుంచి కోరుకునేది. అదే ప్రస్తుతం ఈ లోకంలో ఉన్న మనందరి ధ్యేయం.

పై లోకాలలో ఉన్న మాస్టర్లు తమ తమ ధర్మాలను సక్రమంగా నిర్వర్తిస్తున్నారు. ఈ లోకంలో ఉన్న మనం కూడా మన ప్రాపంచిక, ఆధ్యాత్మిక ధర్మాలను సక్రమంగా నిర్వర్తిద్దాం.

ఇంతకన్నా ఏం చెప్పేది ?



# "మాస్టర్ E.K.!"

ఎంత చక్కటి మాస్టారో !

ఎంత అద్భుతమైన మాస్టారో!

ఆంధ్రదేశపు నవీన ఆధ్యాత్మిక రత్నాలలో అగ్రగణ్యుడు!

ఆధ్యాత్మిక శాస్త్రీయ విధానాన్ని మొన్న మొన్నటి వరకూ దేశ దేశాలలో శాయశక్తులా విస్తరించ ప్రయత్నించిన మహాయోగి !

చిన్న నాటి నుంచీ ఆధ్యాత్మిక గురువు తన తండ్రే!

చిన్నప్పటి నుంచే దివ్యాశయాలతో పెంచబడ్డారు.

ప్రప్రథమంగా "హోమియోపతి వైద్య విధానం" ద్వారా మానవాళి సేవకు అంకిత మయ్యారు.

అనేకానేక ఉచిత వైద్య కేంద్రాలను స్థాపించిన మహా మనీషి!

విశేషంగా జ్యోతిఃశాస్త్రంలో పరిశోధన సల్పినవారు.

వేద వాఙ్మయాన్నీ, వేదజ్ఞాన సంపదనూ కూలంకషంగా అధ్యయనం చేసిన మహాత్మ !

మాస్టర్ C.V.V.కి ఏకలవ్య శిష్యుడు.

థియోసాఫికల్ మూవ్‌మెంట్ యొక్క, మేడం బ్లవట్స్కీ యొక్క అత్యంత ప్రియతమ విద్యార్థి.

నిరంతరం స్వచ్ఛమైన చిరునవ్వుని ముఖంలో జోడించుకున్న కరుణామయుడు, ఆనందమయుడు.

అలుపెరగమని కార్యసాధకుడు, ప్రపంచాన్నంతా అనేకమార్లు చుట్టి వచ్చినవాడు.

ఎదురుపడిన ప్రతి మనిషినీ ఆధ్యాత్మిక పరంగా ఉత్తేజింప ఉద్యుక్తుడైనవాడు.

పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ ధ్యానులందరూ తప్పకుండా అధ్యయనం చేయ వలసిన జ్ఞానమూర్తి అయిన మాస్టర్ E.K. కి ఇవే జోహార్లు !

ఇవే మాస్టర్ E.K. గారికి అభినందనలు !

ఆంధ్రరాష్ట్రంలో ప్రతి ఒక్కరూ మాస్టర్ E.K. లా కాగలిగితే అంతకన్నా ఇంకేం కావాలి !

# "మహాస్వామి వివేకానంద"

'స్వామి' అనే చిన్న బిరుదు అంతటి మహాత్ముడికి ఎలా వచ్చిందో అర్థం కాదు!

అయితే, పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ ధ్యానులకు మటుకు ఆయన 'మహాస్వామి'.

ఊర్ధ్వ, మహాకారణ లోకాలలో ఉండి, తన ప్రధాన శిష్యులలో ఒకరైన శ్రీరామకృష్ణ పరమహంసను ముందుగా భూలోకానికి పంపి, తరువాత శ్రీ రామకృష్ణ పరమహంసకు 'శిష్యుడు'గా తానే అవతరించిన సిద్ధపురుషుడే మహాస్వామి వివేకానంద!

వివేకానంద మహాస్వామి హిందూమతంలోని అసలైన, సిసలైన ఆధ్యాత్మికతను ఎలుగెత్తి చాటిన మహాత్ముడు. సనాతన ఋషి విజ్ఞానాన్ని ఆధునిక పరిభాషలో ప్రప్రథమంగా విస్తారంగా వ్యాఖ్యానించిన ఆధ్యాత్మిక శాస్త్రజ్ఞుడు! ఎంతోమంది తన అనుయాయులను సుశిక్షితులైన ఆధ్యాత్మిక సుశాస్త్ర విద్యార్థుల్లా, యోగాభ్యాసకుల్లా, కర్మయోగ వీరుల్లా తీర్చి దిద్దిన సాటిలేని నాయకుడు. అద్వైతామృతాన్ని దశదిశలా గుభాళింప చేసిన పరమ ఆచార్యుడు!

తన ఏడు చక్రాలలో 'ఆజ్ఞా చక్రాన్ని', అంటే 'దివ్యచక్షువు'ను, మినహాయించి మిగతా అన్ని చక్రాలనూ అమోఘంగా ఉత్తేజపరచుకున్నవాడు. ఆ ఒక్క చక్రాన్నీ కనుక ఉత్తేజింప చేసుకుని వుంటే 'అపరబుద్ధుడు' అయి వుండేవాడు!

వివిధ కోశాలలో మొదటిదైన అన్నమయ కోశ పరంగా, రెండవదైన ప్రాణమయ కోశపరంగా, మూడవదైన భావనామయ కోశపరంగా, నాల్గవదైన విజ్ఞానమయ కోశపరంగా ఐదవదైన ఆనందమయ కోశపరంగా, మరి ఏడవదైన నిర్వాణమయ కోశపరంగా, మనమందరం కూడా ఆయనలాగే "అపార బల సంపన్నులం"గా అయి తీరాలి.

ఆరవ చక్ర విషయంలో మటుకు "థియోసాఫికల్ సొసైటీ మాస్టర్స్" లాంటి వారు, "లోబ్‌సాంగ్ రాంపా" లాంటివారు మనకి ఆదర్శప్రాయులు.

ఈ విషయాలను గుర్తుంచుకుని మనం అందరం కూడా వివేకానంద మహాస్వామిలా, ఇంకా గొప్పగా, కావడానికి కృషి చేద్దాం. అప్పుడే ఊర్ధ్వ లోకాలలో వున్న ఆయన మనల్ని చూసి గర్విస్తాడు, సంతోషిస్తాడు. మరి ఆయన్నీ సంతోషపరుద్దామా ? నిర్విరామ కృషి వల్లనే, మని 'వివేక' సంపత్తి వల్లనే, నిత్య 'ఆనంద' సాధన వల్లనే ఇది సాధ్యం.

# "యోగిరాజ శ్యామాచరణ లాహిరి!"

**20వ** శతాబ్దపు మధ్య భాగంలో భారతదేశాన్నీ, అమెరికానూ, మరి యావత్ ప్రపంచాన్నీ ఆధ్యాత్మిక పరంగా, యోగపరంగా పరుగులెత్తించిన మహనీయుడు శ్రీ యోగానంద పరమహంస.

"గురు శిష్యుల సంబంధం అంటే ఇలా ఉండాలి" అన్నట్లుగా యోగానంద పరమహంసను తీర్చిదిద్దారు ఆయన గురువు శ్రీ యుక్తేశ్వర గిరి. మరి ఆ యుక్తేశ్వర గిరి గారిని "అంతటి గురువు"గా తీర్చిదిద్దిన పరమ గురువే శ్రీ శ్యామాచరణ లాహిరి.

"శ్వాస క్రియను గమనించండి" - "ముక్తిని పొందండి" - "దివ్యశక్తులను పొందండి" - అన్న ఏకైక సిద్ధాంతాన్ని, సంసార బాధ్యతలను అన్నింటినీ నిర్వర్తిస్తూనే, సంసార బాధ్యతలను అన్నింటినీ నిర్వర్తిస్తూనే, సంసార సుఖాలన్నింటినీ పొందుతూనే, తనతో పరిచయమైన ప్రతి వ్యక్తికీ చాటి చెప్పిన మహనీయుడు శ్రీ శ్యామాచరణ లాహిరీ. అంటే, ఆయన నిఖార్సైన, సిసలైన "పిరమిడ్ మాస్టర్" అన్నమాట.

భూమండలానికి "ఆధ్యాత్మిక హెడ్ క్వార్టర్స్" అయిన హిమాలయ శ్రేణిలోని పరమ గురుమండలిలో మనకు తెలిసినంతవరకూ అగ్రగణ్యుడైన వాడే శ్రీ మహావతార్ బాబాజీ - సుమారు 5,000 సం॥గా భౌతిక శరీరంలో ఉంటున్న యోగీశ్వరుడు !

ఆయన ప్రియతమ శిష్యుడే శ్రీ లాహిరి "గృహస్థాశ్రమంలోనే ఉండి అందరూ యోగ్యులై విలసిల్లాలి" అన్నదే శ్రీ బాబాజీ ఆదేశం.

ఇదే అన్ని పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీల ముఖ్య ఆశయం కూడా. ఈ యోగుల పరంపరకు పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ మాస్టర్స్ అందరి తరపున మరి ప్రపంచ ధ్యానుల అందరి తరపున శతకోటి వందనాలు!

  

# "స్వామి చిన్మయ"

స్వామి చిన్మయ గురించి తెలియనివారు ఎవరూ వుండరు - భారతదేశంలో కానీ, ప్రపంచంలో కానీ!

ఆయన ఓ 'వన్‌మేన్ - ఆర్మీ'లా భూమండలంలో కదం త్రొక్కారు. ఎవ్వరికీ ఊపిరి ఆడనివ్వలేదు. తాను ఊపిరి కూడా తీసుకోకుండా శ్రమపడ్డారు !

ఏమిటో 'తపన' అందరినీ బాగు చెయ్యాలని, అదీ తక్షణమే ! ఆత్మజ్ఞానాన్ని బోధ చెయ్యాలంటే ఉర్రూతలూగేవారు! ఆయనకు భగవద్గీత, ఉపనిషత్‌లు మొదలయినవన్నీ 'కొట్టిన పిండి'!

స్వామి శివానంద, స్వామి తపోవన్‌జీ గార్ల దగ్గర 'శిష్యరికం' అన్నది తాను "మాస్టర్ల"గా పిలిపిల్లడం కోసమే చేశారు.

చిన్న పిల్లలకు వుండే 'చిలిపితనం' - యువకులకు వుండే 'ఆవేశం'.

ప్రౌఢులకు వుండే 'కార్యదీక్ష' - వృద్ధులకు వుండే 'లోకజ్ఞానం' ;

యోగులకు వుండే 'ఏకాగ్రత' - ఋషులకు వుండే 'దార్శనికత';

ప్రవక్తలకు వుండే 'వేగం' - నాయకులకు వుండే 'వాక్పటిమ';

రాజులకు వుండే 'రాజసం' - చక్రవర్తులకుండే 'ఠీవి'....

అన్నీ ఒకే మనిషిలో రంగరించి వున్న అసామాన్యుడు స్వామి చిన్మయ !

1976లో ఆయన దగ్గర కూర్చుని వేణువు వాయించే భాగ్యం నాకు కల్గింది కర్నూలులో ! (He immensely enjoyed my Flute and commented, "where were you all these days?") పది సంవత్సరాల తరువాత హాంకాంగ్ లో మళ్ళీ రెండవసారి కలయిక.

'చిన్మయ' అంటేనే 'భగవద్గీత' ! 'భగవద్గీత' అంటేనే 'చిన్మయ' !

జ్ఞానయజ్ఞాలు ఆయనతోనే ప్రారంభం అయ్యాయి. భారతదేశంలోనూ, ప్రపంచంలోనూ ! లెక్కలేనన్ని ఆధ్యాత్మిక పాఠశాలలు స్థాపించిన 'సాంఘిక సంస్కర్త'.

ఇంగ్లీషు భాషలో ప్రావీణ్యత అద్వితీయం. ముఖంలో ఎప్పుడూ చిరునవ్వు.

గత 2, 3, 4 దశాబ్దాలలో భారతీయులందరూ తమమీద తాము గౌరవపడేలా చేసిన ఏకైక వ్యక్తి ! ప్రతి పిరమిడ్ మాస్టరూ, స్వామీజీ దగ్గర నుంచి 'స్ఫూర్తి'ని తీసుకోవాలి.

ఒకసారి స్వామి చిన్మయగారు మరి డా॥ శ్రీపాద పినాకపాణిగారు కార్లో వెళ్తున్నారు.

పినాకపాణి గారు "కర్నూలు చిన్మయ మిషన్" ప్రెసిడెంట్‌గా వుండేవారు. పినాకపాణి గారు అన్నారట చిన్మయానందతో "What Vivekananda started, you are finishing" అని !

చిన్మయ ఫక్కున నవ్వి "I am 'completing' what he had started, not 'finishing' what he has started" అని గలగలా నవ్వారట.

'చిన్మయ'నామ ఆత్మజ్ఞాన, అద్వైత శిఖరానికి

పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీల మాస్టర్ల అందరి తరఫున ఆత్మాభివందనాలు.



# "ఏర్పేడు స్వామి !"

ఆధునిక కేరళ రాష్ట్ర యోగులలో ప్రప్రథముడు "శ్రీ నారాయణ గురూజీ"!

ఆధ్యాత్మిక శాస్త్రజ్ఞుడై, యోగియై, అది చాలదన్నట్లు సాంఘిక విప్లవాన్ని కూడా కేరళ రాష్ట్రంలో తీసుకువచ్చిన విప్లవకారుడు ఆయన

ఆయన దగ్గర [illegible], అదే విధంగా ఆంధ్రరాష్ట్రంలో ఆధ్యాత్మిక సంచలనాన్నీ, సాంఘిక విప్లవాన్నీ సృష్టించిన మహాత్ముడే "శ్రీ ఏర్పేడు స్వామి", లేక "శ్రీ మళయాళ స్వామి"!

'నిజమైన ఆధ్యాత్మికత' అన్నది తప్పడు సాంఘిక ఆచారాలకూ, మరి బూజుపట్టిన మూఢ అభిప్రాయాలకు ఎప్పుడూ గొడ్డలి దెబ్బే కదా !

"ధ్యానమే మూలం ఆధ్యాత్మికతకు" అని పన్నెండు సంవత్సరాలు తిరుమల కొండల్లో ధ్యాన సాధన చేసి చూపించాడు ఈ స్వామి జగత్తుకంతటికీ!

ఆ మహాత్ముని అడుగుజాడలే, ఆ ఋషి అడుగు జాడలే పిరమిడ్ మాస్టర్లందరికీ గొప్ప స్ఫూర్తినీ, ఉత్సాహాన్నీ ఇచ్చేది - విశేషంగా 'తిరుపతి' పిరమిడ్ మాస్టర్లకు!

ఆయనకెంత మహదానందంగా వుందో పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ మాస్టర్ల యొక్క ఆధ్యాత్మిక ఉధృతాన్ని చూస్తూంటే !

ఆయనకు మన అందరి సహస్ర కృతజ్ఞతాభివందనాలు !



# "స్వామి దయానంద సరస్వతి!"

ఆర్య సమాజ స్థాపకుడు శ్రీ దయానంద!

నవీన భారతదేశ సంస్కర్తలలో అగ్రగణ్యుడు స్వామి దయానంద!

"వేదాలను అంత చక్కగా అధ్యయనం చేసినవారు భారతదేశంలో మరొకరు లేరు" అని ఈయన గురించి అన్నారు స్వయంగా అరవిందులవారే. థియోసాఫికల్ సొసైటీ ఫౌండర్ అయిన మేడమ్ బ్లావెట్స్కీగారు ఇండియా వచ్చినప్పుడు ఆవిడను ఆకట్టుకున్న ఏకైక ఆధ్యాత్మిక వేత్త స్వామి దయానంద సరస్వతి.

పాడు సంఘం, ఆయన్ను చంపివేసింది ! విషాన్ని త్రాగించింది ! కానీ సత్యం ఎప్పుడూ చావదు - "సత్యమేవ జయతే" కదా ! "మూర్తి పూజ మెట్టు కాదు అగడ్త " అని దిక్కులు పిక్కటిల్లే నినాదాన్ని ప్రపంచానికి ప్రసాదించారు స్వామి దయానంద! ఈ విషయంలో స్వామి దయానంద పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీల మాస్టర్లందరికీ మహా ఆదర్శప్రాయుడు.

"పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ"వారు అందరి మాస్టర్స్ వద్ద నుంచీ, అందరి మంచీ గ్రహించటంలో, అదే సమయంలో ఆయా మాస్టర్లలోని స్వల్ప వికారాలను తిరస్కరించటంలో ఆరితేరిన హస్తాలు! స్వామి దయానందుల వారి "సత్యార్థప్రకాశం'’లో ఎన్నో త్యాజ్యనీయమైనవైనా, ఎన్నో గ్రాహ్యమైనవి కూడా.

భారతదేశంలో దేవాలయాలు వుండి తీరాలి! విగ్రహాలు ఉండి తీరాలి! కానీ 'విగ్రహారాధనలు' ఉండరాదు ! అది పూర్ణ పిచ్చి! 'ఎవరెస్టుకు' సరిసమానమైన మూర్ఖత!

ఆస్తిక ప్రపంచ ప్రధాన సిద్ధాంత మేమంటే, - " మనం ఆత్మ స్వరూపులం"!

కానీ 'ఆస్తికత' అన్నదానికి విపరీతంగా చరిస్తున్నారు నేటి మూర్ఖ ఆస్తికులు. నేటి ఆస్తికత 'మూర్తిపూజ' 'వృక్షపూజ', 'జంతుపూజ', 'ప్రత్యేక మనుషుల పూజ' గీతుల్లో అందరికీ వెగటు పుట్టిస్తోంది.

విగ్రహారాధన అనేది 'భక్తి యోగ' సూత్రంగా విపరీత పరిణామం చెందిన వింతరోజులు యిక ముగిసిపోయాయి!

వాస్తవానికి, 'భక్తి' అనే దానికి ఆధ్యాత్మికతలో ఎలాంటి స్థానమూ లేదు.

ఉన్నదంతా ఒకే పదార్థం! వున్నదంతా ఒకే ఏకత్వం!

రెండుగా సృష్టిలో లేవు; వున్నది ఒక్కటే!

"సర్వం ఖల్విదం బ్రహ్మ !" - "అహం బ్రహ్మాస్మి!"

తనకు తాను పూజించుకోవడమేమిటి?

"జ్ఞానాన్ ముక్తి:"అన్నాడు కదా కపిలుడు!

కావలసినవి 'ధ్యానం' - 'ఆత్మజ్ఞానం '! అంతేకానీ ఎవరి మీదా, ఎవరి పట్లా 'భక్తి' కాదు!

కనుకనే, స్వామి దయానంద సరస్వతి గారు "మూర్తి పూజ మెట్టు కాదు, అగడ్త" అని ఆత్మజ్ఞుడుగా వక్కాణించారు.

ఈ మౌలిక సందేశాన్ని భారతదేశం యావత్తుకూ అందించడానికై తన జీవితాన్నే పణంగా పెట్టిన మహాత్యాగి., దయానందజీకి 'శతసహస్ర థ్యాంక్స్'!!

"మూర్తి పూజ మెట్టు కాదు అగడ్త !"

"మూర్తి పూజ మెట్టు కాదు అగడ్త !"

"మూర్తి పూజ మెట్టు కాదు అగడ్త !"

  

# "ఆది శంకరులు!"

"ఆది శంకరులు!" ఆ పేరు ఉచ్చరిస్తేనే తనువు, మనస్సు, బుద్ధి, ఆత్మ అన్నీ పులకరిస్తాయి!

ఆదిశంకరుల తేజోవంతమైన భౌతిక శరీరాన్ని మనోచక్షువుతో ఊహించ గలగటంతోనే మన భౌతిక కాయం పులకిస్తుంది !

ఆ నిర్మలాతినిర్మలమైన మనస్సును తలచుకుంటేనే మన మనస్సు ఉర్రూత లూగుతుంది !

ఆయన బుద్ధి తీవ్రతను ఒకింత గమనిస్తే చాలు, మన బుద్ధి తీవ్రతరం అవుతుంది.

ఆ మహోన్నతమైన ఆత్మబోధనలను దర్శించగలిగిన వాళ్ళ ఆత్మ, గగుర్పాటు చెందకుండా వుండటం అసంభవం !

శ్రీ శంకరులవారు మేటి అయిన జ్ఞాని! సాటి లేని యోగి! ఆయన బ్రహ్మ జ్ఞానానికి నిదర్శనం ఆయన మ్రోగించిన అద్వైత భేరే !

ఆయన మహత్యాలు మచ్చుకు :

✧ భౌతికకాయాన్ని అంటే 'మాంస పిండా'న్ని 'మంత్ర పిండం'గా చేసి ఇష్టం వచ్చిన ప్రదేశాలకు క్షణకాలంలో వెళ్ళగలగడం.

✧ పరకాయ ప్రవేశ విద్యను కేళీవిలాసప్రాయంగా చేయగలగడం.

పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ ధ్యానులందరికీ శ్రీశంకరుల వారు ప్రధాన ఆదర్శమూర్తి. ప్రతి ఒక్కరూ శంకరులుగా కావాలి. అదే ఆదిశంకరులు కోరుకునేది !

అందుకు అణుమాత్రమైనా తక్కువ ధ్యేయం పెట్టుకుంటే ఆయన పకపక నవ్వుతాడు. అవహేళన చేస్తాడు !

శంకరుల ఆధ్యాత్మిక బోధనలలో 'కోహినూర్ వజ్రం' లాంటిదైన 'భజగోవిందం' ముఖ్యంగా పిరమిడ్ ధ్యానులందరి జీవితాలలో విడదీయలేని అంతర్భాగం అయింది.

ప్రతి ధ్యాన క్లాసులోనూ, శిక్షణా శిబిరంలోనూ 'భజగోవిందం' శ్లోకాలు గానం చేయబడకపోతే ఆ ధ్యాన క్లాసు సార విహీనంగా, కళావిహీనంగా వుండటం మనందరికీ ప్రత్యక్ష అనుభవం.

"పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ ఫిలాసఫీ" అన్నది బుద్ధుడి యొక్క, శంకరుడి యొక్క, జీసస్ క్రైస్ట్ యొక్క, మహమ్మద్ యొక్క, మహావీరుడి యొక్క అద్భుతమైన ధ్యాన ప్రకాశాలతో ఆవిర్భవించినదే ! "పిరమిడ్ ఫిలాసఫీ అన్నది వారందరి బోధనలతో సంపూర్ణంగా నిండివుండి"న భూతో న భవిష్యతి" అన్న విధంగా పరిపుష్టమైనదే!

శ్రీ శంకరుల వారి పాదపద్మాలకి పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ ధ్యానుల అందరి వినమ్ర వందనాలు. వినయపూర్వక ప్రణామాలు.

ఓ మహాస్వామీ ! మీరు మాలో వున్నారు ! మీరు మా వెంట వున్నారు ! మాతో కలిసి అద్వైతంగా వున్నారు !



# "బుద్ధం శరణం గచ్ఛామి!"

జన్మ జన్మలకూ "బుద్ధం శరణం గచ్ఛామి" అన్న సూత్రం తప్ప అన్యధా శరణం నాస్తి ! ఎవరికైనా! ఏ లోకంలోనైనా!

మానవుడి మొదటి జన్మలలో అయినా సరే, మానవుడి మధ్య జన్మలలో అయినా సరే, మానవుడి చివరి జన్మలలో అయినా సరే "బుద్ధం శరణం గచ్ఛామి" అన్న సూత్రం తప్ప వేరే శరణు అసంభవం.

ఎందుకంటే, పిల్లల నుంచి వృద్ధుల వరకూ, పామరుల నుంచి పండితుల వరకూ, సామాన్యుల నుంచి అసామాన్యుల వరకూ, శైశవాత్మల నుంచి వృద్ధాత్మల వరకూ - అందరికీ సరిసమానంగా వర్తించేదీ, అందరినీ సరిసమానంగా వృద్ధి పరచేదీ ఒక్క బుద్ధ మార్గం తప్పితే విశ్వ సృష్టిలో మరొకటి లేదు !

బుద్ధుడి ప్రతి పలుకూ దివ్యం, దివ్యం !

బుద్ధుడి ప్రతి చూపూ దివ్యం, దివ్యం !

బుద్ధుడి ప్రతి కదలికా దివ్యం, దివ్యం !

బుద్ధుడి ప్రతి మౌనమూ దివ్యం, దివ్యం !

బుద్ధుడి ఆచరించిన ధ్యానమే ధ్యానం!!

బుద్ధుడు ప్రవచించిన జ్ఞానమే జ్ఞానం!!

బుద్ధుడు జీవించిన జీవనమే జీవనం !!

పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ ధ్యానుల ధ్యాన రీతీ, జ్ఞాన రీతీ, జీవన తీరూ ఆ గౌతమబుద్ధుని ధ్యాన రీతి, జ్ఞానరీతి, జీవను రీతులతో సరిసమానంగా తూగగలగాలి.

తత్ లక్ష్య సాధనకే మన అందరి జీవితం అంకితం.

బుద్ధం శరణం గచ్ఛామి ! - బుద్ధం శరణం గచ్ఛామి !! - బుద్ధం శరణం గచ్ఛామి !!!

  

# "మనస్సు - బుద్ధి"

కర్మానుసారిణీ బుద్ధిః!

"నేను" అంటే "శరీరం, మనస్సు బుద్ధి"!

మొదటి సంగతి అందరికీ తెలుసు; యిక రెండవది 'మనస్సు'.

ప్రపంచం మనకు ఇచ్చిందే మనస్సు.

పుట్టినప్పటి నుంచి మనం పెరిగిన యింటి వాతావరణం,

తల్లిదండ్రుల అభిప్రాయాలు, యితర కుటుంబ పెద్దల సుద్దులు - యివి అన్నీ

వెరసి 'మనస్సు'ను మనకు యిస్తుంది.

ఈ 'మనస్సు' అన్నదే మానవ జీవితాలను పరిపరి దిశలలో లాగుతూంటుంది.

మనస్సుకు లోనైనవాడు సుఖదుఃఖాలను 'రాత్రి పగలు', 'ఎండ వానలా'

ఎడతెరపి లేకుండా అనుభవిస్తూ వుంటాడు.

యికపోతే మూడవదే 'బుద్ధి'.

ప్రపంచం మనకు యిచ్చేది 'మనస్సు' అయితే

మనకు మనం సువిచారణతో సాధనతో యిచ్చుకునేదే 'బుద్ధి'!

అలాగే పూర్వ జన్మలలోని అనంతకర్మల సారాంశమే 'బుద్ధి'!

కనుకనే "కర్మానుసారిణీ బుద్ధిః" అన్నారు.

ప్రపంచ రీతులనూ, ఆధ్యాత్మిక సత్యాలనూ గమనించి అశుభ కర్మలను వదలిపెట్టేసి,

శుభకర్మలనే చేబడితే క్రమక్రమంగా మనకు ఆ మూడవది, అదే 'బుద్ధి', సంప్రాప్తిస్తుంది.

సత్య ప్రతిరూపమే బుద్ధి; ధర్మ ప్రతిరూపమే బుద్ధి!

జ్ఞాన ప్రతిరూపమే 'బుద్ధి'; 'బుద్ధి' లేని మానవుడు శాంతి లేని 'జీవుడు'!

బుద్ధి వున్న జీవుడు ముక్త పురుషుడు.

ప్రపంచం బుద్ధిని యివ్వదు. గురువు బుద్ధి వున్నవాడే కానీ ఇతరులకు బుద్ధిని యివ్వజాలడు.

మన నిత్య జాగరూకతతో కూడిన మన శుభకర్మలే మనకు బుద్ధిని ప్రసాదిస్తాయి.

కనుక శుభ కర్మలనే చేబడదాం.

బుద్ధినే సాధిద్దాం "బుద్ధుళ్ళ"ం అవుదాం!

# "మహా భాగ్యం!"

మనిషికి శారీరకపరం గా ఆరోగ్యమే మహాభాగ్యం !
మనిషికి మానసికపరం గా ప్రశాంతతే మహాభాగ్యం !
మనిషికి బుద్ధిపరం గా శాస్త్రీయ దృక్పథమే మహాభాగ్యం!
మనిషికి సామాజికపరం గా ప్రాణ మిత్రులుండటమే మహాభాగ్యం !
మనిషికి ఆధ్యాత్మికపరం గా దివ్యచక్షువు ఉత్తేజితమై వుండటమే మహాభాగ్యం !

మనిషికి ఆహారపరంగా రెండు రోజుల కొకరోజు రెండుపూటలా రుచికరమైన తిండి వుండటమే మహాభాగ్యం.
అదే విధంగా రెండు రోజులకొకరోజు పూర్తి లంఖణం చేయడ'మే మహాభాగ్యం!
మనిషికి కుటుంబపరం గా 'పరస్పరానుకూల దాంపత్యం వుండట'మే మహా భాగ్యం !
'కష్టపడి చెమటోడ్చి సంపాదించిన ధన'మే మహాభాగ్యం !
మహాభాగ్యం అన్న పదానికి ఇవీ సరియైన అర్థాలు, సరియైన వివరణలు.

తనకు తాను చూసుకున్న తరువాత, ఇక ఒకరిద్దరికి ప్రతిరోజూ 'కొంత సమయా'న్నీ 'కొంత శక్తి'నీ కేటాయించగలగడమే మహాభాగ్యం !
ఎన్ని కష్టాలూ, ఆపదలూ వచ్చినా ఎప్పటికప్పుడు సొంత కాళ్ళ మీద నిలబడ గలగడమే మహాభాగ్యం !
ఇంటి ఆవరణలో రకరకాల మొక్కలనూ, చెట్లనూ పెంచగలగడమే మహాభాగ్యం !
రకరకాల పక్షులనూ, జంతువులనూ పోషిస్తూ, వాటిని సదా సంరక్షిస్తూ వుండగలగడమే మహాభాగ్యం !
చుట్టుప్రక్కల వున్న వాతావరణాన్ని కాలుష్యం చేయకుండా వుంచగలగడమే మహాభాగ్యం !
ఇంటి ఆవరణలో రకరకాల మొక్కలనూ, చెట్లనూ పెంచగలగడమే మహాభాగ్యం !
'మహాభాగ్యం' అన్న పదానికి ఇవీ సరియైన అర్థాలు', సరియైన వివరణలు' !

రోజంతా కష్టపడిన తరువాత కొన్ని గంటలైనా సుఖంగా ఇక నిద్రపోగలగడమే మహాభాగ్యం !

ప్రతిరోజూ ఒక కొత్త విద్యను ఓ కొత్త కళను ఒకింతైనా అభ్యసించగలగడమే మహాభాగ్యం !
వీలైనంత ఎక్కువ సమయంలో, ప్రతిరోజూ, చక్కటి సునాదమైన సంగీతాన్ని
వినగలగడమే మహాభాగ్యం !
చక్కటి సంగీతానికి పైమరచి, అప్పుడప్పుడూ, నృత్యం చేయగలగడమే మహాభాగ్యం !
రోజుకో ఆట, అందరితో కలిసి ఆడగలగడమే మహాభాగ్యం !
మహానుభావుల పుస్తకాలు చదవడమే మహా, మహాభాగ్యం !
రోజుకో గంట సజ్జనులతో గోష్ఠి చేయడమే మహాభాగ్యం!
రోజుకో గంట సేపు మౌనంగా వుండటమే మహాభాగ్యం!
నేర్చుకున్న విద్యలనూ, కళలనూ ఇతరులకూ నేర్పించటమే మహాభాగ్యం!
మహాభాగ్యం అన్న పదానికి ఇవీ సరైన అర్థాలు - ఇవీ సరియైన వివరణలు!
ఏ మనిషితోనైనా కళ్ళలో కళ్ళు పెట్టి సూటిగా చూడగలగటమే మహాభాగ్యం!
ఏకాంతంగా నివసిస్తున్నా ఇంటిని పరిశుభ్రంగా వుంచుకోగలగడమే
మహాభాగ్యం!
ధరించిన 'దేహాన్ని' ప్రతిరోజూ నిగనిగలాడుతూ వుంచుకోగలగడమే
మహాభాగ్యం!
ప్రతి సూర్యోదయాన్నీ, ప్రతి సూర్యాస్తమయాన్నీ ప్రశాంతంగా తిలకించగలగటమే
మహాభాగ్యం !
పౌర్ణమి రాత్రుల్లో ఆ యొక్క అద్భుత సౌందర్యాన్నీ, ప్రశాంతతనూ, ఏకాంతంగానూ
మరి సామూహికంగానూ, అనుభవించగలగటమే మహాభాగ్యం !
నదీస్నానాలూ, సముద్ర స్నానాలూ వీలైనప్పుడల్లా చేయగలగడమే మహాభాగ్యం !
నడిగొత్తుల్లో, నగర విశాల వీధుల్లో, నిశ్శబ్ద స్థితుల్లో నిర్భయంగా సంచారం
చేయగలగటమే మహాభాగ్యం !
చిన్న పిల్లలతో అన్నీ మరచిపోయి కేరింతలు కొట్టడమే మహాభాగ్యం!
ఎప్పుడు వీలైతే అప్పుడు, ఎక్కడ పడితే అక్కడ కళ్ళు మూసుకుని 'శ్వాస మీద
ధ్యాస' పెట్టడమే మహాభాగ్యం !
'మహాభాగ్యం' అన్న పదానికి ఇవీ సరియైన అర్థాలు, ఇవీ సరియైన వివరణలు!

# "దర్పహః - దర్పదః!"

"విష్ణు సహస్ర నామం" అన్నది ఓ మహత్తర గ్రంథం !

భీష్మ పితామహుడు తన తుది ఘడియల్లో ధర్మనందనుడికి ఇచ్చిన జ్ఞాన సందేశం!!

విష్ణు సహస్రనామంలోని వెయ్యి నామాల్లో రెండు అద్భుత నామాలు -

"దర్పహః" అంటే దర్పాన్ని హరించేది; "దర్పదః" అంటే దర్పాన్నిచ్చేది.

విష్ణు సహస్ర నామంలోని ప్రతి నామం కూడానూ

విష్ణుగుణాన్ని, విష్ణుతత్వాన్ని విశదీకరిస్తుంది, విపులీకరిస్తుంది.

'విష్ణుః' అంటే "సర్వత్రా వ్యాపించి ఉన్నవాడు" అని అర్థం.

ఆత్మే సర్వత్రా వ్యాపించి ఉన్న వస్తువు.

ప్రతి ఆత్మజ్ఞానీ ఓ 'విష్ణువు'!

అదే విధంగా ప్రతి ఆత్మజ్ఞాని కూడా 'ఓ వేయి పడగల పాము', 'సహస్ర ఫణిశాయి'!

సహస్ర దళ కమలాన్ని సంతరించుకున్నవాడు.

ఇక్కడ 'సహస్ర' అంటే 'వెయ్యి' అని కాదు, 'అనంతం' అని అర్థం.

మనం మాట వరుసకి "నూట తొంబై పనులున్నాయిరా!" అన్నప్పుడు

సరిగ్గా "నూట తొంబై పనులు"న్నాయని కాదు అర్థం !

ఒక ఆత్మజ్ఞాని యొక్క అనంతమైన గుణగణాలలో

ఒక వెయ్యిని మాత్రం విశదీకరించి చెప్పినవాడు భీష్మపితామహుడు.

"విష్ణు సహస్రనామం"లోని ప్రతి నామమూ ఒక అద్భుతమైన పాఠం.

ప్రతి పిరమిడ్ ధ్యాని కూడా విధిగా చదువవలసిన గ్రంథం "విష్ణు సహస్ర నామం".

ఇక "దర్పహః", "దర్పదః" అన్న నామాల దగ్గరికి వద్దాం.

ఆత్మజ్ఞానం కలిగినప్పుడు "నాకే తెలుసు" అన్న దర్పం హరించుకుపోతుంది.

అదే "దర్పహః" అంటే!

ఆత్మజ్ఞాని కానివాడు ఇతర ఆత్మజ్ఞానులను చూడలేడు...

కనుక, "తనకన్నా మించినవారు ఎవ్వరూ లేరు" అనుకుంటాడు.

తనకున్న ఏవో చిల్లర వాటిని చూసుకుంటూ అహంకారియై తిరుగుతూ ఉంటాడు.

పగలు ఏ నక్షత్రాలూ కనపడకపోయినా,

రాత్రి కాగానే నక్షత్రాలన్నీ దేదీప్యమానంగా వెలిగిపోతూ కనబడినట్లు, ఒక అజ్ఞాని ఆత్మజ్ఞానిగా కాగానే మిగిలిన ఆత్మజ్ఞానులందరూ కళ్లకు మిరుమిట్లు గొలుపుతూ దర్శనమిస్తారు!

అప్పుడు "నాకింతవరకూ ఏమీ తెలియదు;

ఇంకా నిజంగా తెలియవలసింది అనంతంగా ఉంది" అని తెలుసుకుంటాడు.

అంతరవకూ అనర్థకారి అయిన అతని మిడిమిడి జ్ఞానం, ఒక్క దెబ్బతో మొత్తం హరించుకుపోతుంది.

ఇదే "దర్పహః" అంటే!

కానీ వెనువెంటనే "దర్పదః" అని కూడా భీష్మాచార్యుల వారు శెలవిచ్చారు.

అంటే "దర్పాన్నిచ్చేది" అని !

ఆత్మజ్ఞాని అయిన వాడికి వెంటనే ఒక విధమైన ఆత్మబలం చేకూరి,

"నేను సాధించాను; నేను తెలుసుకున్నాను; నేను కూడా తెలుసుకున్నాను".

అన్న సత్యాన్ని సంతోషంగా, సగర్వంగా వినయంగా ప్రకటిస్తాడు.

ఆత్మజ్ఞానం లేని వాడికి ఆత్మజ్ఞానికుండే ఆత్మబలం 'అహంకారం'లా కనబడుతుంది.

కానీ అది అహంకారం కాదు.

ఇదీ "దర్పదః" అన్న నామానికి ఉన్న అర్థం.

పిరమిడ్ మాస్టర్లెవ్వరికీ గర్వం లేదు, గర్వం ఉంది; అదీ పరిస్థితి.

వెధవది, భీష్మాచార్యుడు చెప్తే గానీ మన సంగతి మనకర్థం కావటం లేదు.

ఈ రెండు పదాలూ ఓ ఉదాహరణకు ఇవ్వటం జరిగింది.

మిగతా గ్రంథమంతా ప్రతి ఒక్కరూ అధ్యయనం చేయాలి.

"పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ" మాస్టర్లందరికీ "హాట్సాఫ్"!

# "ఆధ్యాత్మిక శాస్త్రవేత్త - ఆనీ బిసెంట్"

"ఆనీ బిసెంట్!"

19వ శతాబ్దాంతంలో 20వ శతాబ్దం ప్రారంభంలో ఈ భూమ్మీద జన్మించిన దివ్యమూర్తులలో ఆనీ బిసెంట్ అత్యంత ప్రముఖురాలు!

ఈ భూమ్మీది ప్రజలు 'ప్రేమ' మరి 'పుణ్యభావం'తో ఎల్లప్పుడూ గుర్తుంచుకునే విధంగా అనేక సంవత్సరాలు ఆమె 'థియోసాఫికల్ సొసైటీ' అధ్యక్షురాలిగా అద్భుతంగా పనిచేశారు !

ఆమె పాశ్చాత్య దేశీయురాలైనా భారతీయ భావాల్నీ, భారతీయ సిద్ధాంతాలనూ పూర్తిగా ఆకళింపు చేసుకున్నారు. పరిపూర్ణ ఆధ్యాత్మిక శాస్త్రవేత్త అయి కూడా రాజకీయ ప్రజాసేవ పట్ల ఎలాంటి విముఖత చూపలేదు. ఆమె ఒక సంవత్సరం పాటు 'ఇండియన్ నేషనల్ కాంగ్రెస్' అధ్యక్షురాలిగా కూడా పనిచేశారు.

ప్రతి పిరమిడ్ మాస్టర్ ఆమె జీవిత చరిత్రనూ, ఆమె వ్రాసిన అద్భుత రచనలనూ తప్పక చదివి తీరాలి !

'ఆధ్యాత్మిక' అంటేనే 'ఆనీ బిసెంట్'! మరి ఆమె 'మాంసం'లో, 'రక్తం'లో, 'కండ'లలో, 'ఎముక'లలో ఆధ్యాత్మిక శాస్త్రం అణువణువునా రూపు దిద్దుకున్నది.

'ఆనీ బిసెంట్'గా తయారవ్వాలని ప్రతి పిరమిడ్ మాస్టర్ కలలు కనాలి !

ఓ మేడమ్ ! 'ఆనీ బిసెంట్' గా జీవించిన మీ దివ్య జీవితానికి సహస్ర వందనాలు!

మేం మీ జెండానే పట్టుకున్న వాళ్ళం ! మీ జ్ఞాన పథాన్నే కొనసాగిస్తాం!

పై లోకాల్లో మిమ్మల్ని కలుసుకుని మితిమీరి ఆనందించడానికి వేయికళ్ళతో ఎదురుచూస్తున్నాం !

అంతవరకు ... మేం కొనసాగిస్తాం ! .... ఈ నిరంతర జ్ఞాన యజ్ఞం !

## "ఉత్తిష్ఠ కౌంతేయ, యుద్ధాయ కృతనిశ్చయః!"

భగవద్గీత ఓ గొప్ప జ్ఞాన భాండాగారం ! అందులో లేనిది మరో చోట లేదు ! మనం ఎలాంటి పరిస్థితుల్లో ఉన్నా తత్ అనుగుణమైన, తత్ అనుకూలమైన జ్ఞాన విశేషం భగవద్గీతలో దొరికే తీరుతుంది.

యుద్ధ సమయం ఏతెంచినప్పుడు "కృత నిశ్చయంతో యుద్ధం చెయ్యి" అన్నాడు కృష్ణుడు. యుద్ధానికి ఎప్పుడూ సుదూరంగా ఉండాలి. మానవులకు కావలసినది యుద్ధం కాదు, శాంతి! మానవులకు కావలసినవి కత్తుల పోటీలు కావు. ఆటలపోటీలు! మానవులకు కావలసినవి రణరంగాలు కావు - క్రీడారంగాలు, నాటకరంగాలు ! కానీ ఇంక యుద్ధం అనివార్యమైనప్పుడు, ఇక వేరే గత్యంతరం లేనప్పుడు, శాంతి మాటలతో, వేదాంతపు చర్చలతో, యుద్ధానికి వెన్ను చూపడమనేది మూర్ఖుల లక్షణం.

సకల రాయబారాలూ, సకల దాన భేదోపాయాలూ నిష్ఫలమై పోయినప్పుడు ఇక ముఖాముఖి ఘర్షణే శరణ్యం; తాడో, పేడో తేల్చుకోవడమే విధి. యుద్ధమే తక్షణ కర్తవ్యం. ప్రపంచంలోని ఆధ్యాత్మిక మానవాళి అంతా ఇక విసిగిపోయింది. "పిరమిడ్ పార్టీ" అన్న దాని ద్వారా ధ్యాన జగత్తు ఇక యుద్ధానికి సన్నద్ధమయింది! 'రోత' అయిన 'పాత'ను మట్టు పెట్టడానికి ధ్యాన సమాధానాలను తయారు చేస్తోంది! అద్భుతమైన నవ్య యుగానికి నూతన హారతిని ఇస్తోంది!

పిరమిడ్ పార్టీ జ్ఞాన శంఖారావాన్ని పూరిస్తోంది! ధ్యాన గర్జనలను చేస్తోంది! ఇంక 'రాయబారాలు' పనికిరావు. బేరసారాలు నిన్నటి మాట! ఇక ప్రంపంచాధిపత్యం కేవలం ఆత్మజ్ఞానులదే ! దేహ భ్రాంతి ఉన్న మూర్ఖజ్ఞానుల క్రింద ఆత్మ జ్ఞాన పరాయణులు ఇక పనిచేయరు!

అరిషడ్ వర్గాలకు లోనైన అల్పాత్ములకు ఇక అరిషడ్ వర్గాలు జయించిన మహాత్ములు సలాంలు కొట్టరు. రాజ్యాధికం నుంచి, గద్దెలపై నుంచి అల్పాత్ములు, హీన చరిత్రులు, ఆత్మజ్ఞాన రహితులు ఇక చక చకా దిగి పోవలిసిందే ! మిద్దెలున్న వాడిది ఇక గద్దె కాదు; మద్దెల వాయించే వాడిది గద్దె కాద! అక్షరం ముక్క లేని మొద్దు సుద్ధలది గద్దె అంతకన్నా కాదు; గుహ్య విద్యను సాధించిన వాళ్ళకే గద్దె! గురువులైన వాళ్ళకే గద్దె! ధ్యానపరాయణులకే గద్దె! జ్ఞాన సోక్రటీస్‌లకే గద్దె! శ్రీరామచంద్రుని లాంటి వారికే గద్దె!

ప్రప్రథంగా మన ప్రపంచ చరిత్రలో ఒక అపూర్వ సంఘటన ఈ 1999 సంవత్సరంలో, ఈ ఆంధ్ర రాష్ట్రంలో జరుగబోతోంది కాదు 'జరగాలి' అన్నది మన బంగారు కల. ఆ బంగారు కల పదహారణాల వాస్తవం కావాలంటే "ఉత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృత నిశ్చయః" లేదా, "ఉత్తిష్ఠ ధ్యాన పుత్ర! యుద్ధాయ కృత నిశ్చయః"

ధ్యానులందరూ ఇక లేవాలి. రామ రాజ్యస్థాపన అనే యుద్ధానికి సంసిద్ధులు కావాలి!

యుద్ధంలో విజయం సాధించాలి. రామరాజ్యం స్థాపించాలి ఈ యుద్ధంలో చనిపోతే వీర స్వర్గం. విజయులమైతే ఈ భూమండలమంతా మనదే !



# "శివుడు - ఇద్దరు పెళ్ళాలు!"

'శివుడు' అంటే 'ఆనందమయుడు'.

ఎప్పుడూ ఆనందంగా వుండేవాడే శివుడు.

ఇద్దరు పెళ్ళాలుంటేనే ఎప్పుడూ ఆనందంగా వుండేది!

ఒక పెళ్ళాం సరిపోదు!

మొదటి పెళ్ళాం - 'ప్రాపంచికం'అయితే , రెండవ పెళ్ళాం - 'ఆధ్యాత్మికం'.

మొదటి పెళ్ళాం 'పార్వతి' అయితే, రెండవ పెళ్ళాం 'ఆకాశ గంగ';

'ఆకాశ గంగ' అంటే 'కాస్మిక్ ఎనర్జీ' ... ఈ రెంటినీ ఎప్పుడూ

ఉపయోగించుకుంటేనే ఎప్పుడూ ఆనందం.

అలా చేసే వాడే శివుడు.

కేవలం భౌతికత మీద గానీ, కేవలం ఆధ్యాత్మికత మీద గానీ

ఆధారపడి వుండే వాళ్ళకి ఆనందం

వుండేది యాభైశాతం మాత్రమే!

మనిషి నూటికి నూరు శాతం జీవించాలి.

పగలు ప్రాపంచికం ఉండాలి; రాత్రి ఆధ్యాత్మికం వుండాలి.

పగలు ఫిజికల్ బాడీ ని ఉపయోగించాలి; రాత్రి ఆస్ట్రల్ బాడీ ని ఉపయోగించాలి.

పగలు ఫిజికల్ బాడీతో రాత్రి ఆస్ట్రల్ బాడీతో సంసారాలు చెయ్యాలి.

'సంసారమే నిర్వాణం' అన్నాడు కదా - మహా యోగి, మహా మేధావి నాగార్జునుడు!

"సంసారం అంటే కేవలం భౌతికత్వమే కాదు;

ఆధ్యాత్మికం కూడా!"అన్నది ఆయన అంతర్యం.

ఇద్దరు పెళ్ళాలతో చక్కగా సంసారం చేస్తేనే నిర్వాణం.

సంసారమే నిర్వాణం, సంసారమే నిర్వాణం, సంసారమే నిర్వాణం.

# "అన్నపూర్ణ - ధ్యానపూర్ణ!"

ఆంధ్ర రాష్ట్రం భారతదేశానికే 'అన్నపూర్ణ'!

అయితే,- మన రాష్ట్రం లోనే ప్రత్యేకమైన అన్నపూర్ణ ప్రాంతాలు కృష్ణ, గోదావరి డెల్టాలు!

అందులోనూ, 'డెల్టా' అనగానే ప్రధానం గా గుర్తు వచ్చేది తెనాలి!

ఎప్పుడూ కళ కళ లాడే ప్రాంతం!

సమృద్ధిగా పంటలు పండించుకుని, పుష్టిగా తిని కంటినిండా నిద్రపోయే ప్రజలు!

పాపం 'ఇదే జీవితం' అనుకుంటున్నారు!

అయితే, అన్నీ ఉన్నా, ఏదో అసంతృప్తి, ఏదో వెలితి!

బహిరంగంగా ప్రకటించకపోయినా లోలోపల శూన్యతను అనుభవిస్తూనే ఉంటారు!

ఒక్కో రోజు నిద్ర వస్తుంది, ఒక్కోరోజు రాదు!

ఒక్కరోజు సంతోషం ఉప్పెనలా పొంగుతుంది;

ఇంకోరోజు దుఃఖం వరదలా వస్తుంది!

కడుపు నిండా ఉన్నా గుండె మాత్రం ఖాళీయే! భుక్తి మార్గం ఉంది కానీ ముక్తి మార్గం లేదు!

"మాదే ముక్తి మార్గం", "మాదే ముక్తి మార్గం"

అని రకరకాలుగా, వివిధ మతాల ప్రబోద్ధుల ప్రలోభాలకు

లోబడి ఎన్ని పూజలు చేసినా, ఎన్ని వ్రతాలను ఆచరించినా, ఎన్ని నోములు నోచినా, యజ్ఞయాగాదులు ప్రదక్షిణలు, జపాలు ఎన్నింటిని చేసినా ఫలితం మాత్రం శూన్యం!

జీవితంలో ఏదీ పుష్పించలేదు! ఒక్కటి మాత్రం జరుగుతోంది ...

జేబులు మాత్రం ఖాళీ అవుతున్నాయి! అయితే ప్రస్తుతం "పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ"లు ఆవిర్భవిస్తున్నాయి!

ప్రబుద్ధులు కాకుండా, నిజమైన బుద్ధుళ్ళు రంగ ప్రవేశం చేస్తున్నారు!

"అన్నపూర్ణ" అయిన ఆంధ్రరాష్ట్రం "ధ్యానపూర్ణ" గా మారిపోబోతోంది.

"ధ్యానం వల్లనే జ్ఞానం - జ్ఞానం వల్లనే ముక్తి" అని అందరూ తెలుసుకునే రోజులు వచ్చేశాయి!

# "ఆత్మజ్ఞాన ప్రభుత్వం"

పూర్వకాలంలో రాజులకు రాజగురువులు ఉండేవారు!
దశరథుడికి వశిష్ఠుడు రాజగురువు!
పాండవులకు శ్రీకృష్ణుడు రాజగురువు!
రాజగురువు లేని రాజ్య ప్రభుత్వం' 'చుక్కాని లేని పడవ' వంటిది!
ఆధ్యాత్మికత లేని 'సామాజికత' ప్రాపంచికత', గమ్యం లేని గమనం వంటివి!
ఆత్మజ్ఞాన రహితమైన లోకజ్ఞానం ఎప్పటికైనా నిరాశనే, అసంతృప్తినే కలిగిస్తాయి.
కడుపు నిండా భోజనం , కంటినిండా నిద్ర, సకల వస్తు వాహనాల సముదాయం
- ఇవే ఆదర్శాలయితే మానవుడి 'నిజప్రకృతి', 'శాశ్వతత్త్వం'- అన్నవి ఎప్పుడూ మరుగున
పడే ఉంటాయి. సమాజంలో అశాంతి, అనారోగ్యం,
అసంతృప్తి అన్నవి శాశ్వత నిలయాలై ఉంటాయి!
మనకు కావలసింది 'రామరాజ్యం' మరి 'శ్రీకృష్ణ రాజ్యం'!
రాముడిలా, శ్రీ కృష్ణుడిలాగా మనం కూడా ఆధ్యాత్మిక శాస్త్రజ్ఞులమైతేనే,
'రామరాజ్యం', 'శ్రీకృష్ణరాజ్యం' అన్నవి నెలకొనేవి!
వశిష్ఠుల వారి దగ్గర 'ధ్యానాభ్యాసం', 'జ్ఞానాభ్యాసం' చేస్తేనే దశరథుడి
ప్రథమపుత్రుడు 'శ్రీరామచంద్ర ప్రభువు' అయ్యాడు !
సాందీపుడి దగ్గర 'ధ్యానాభ్యాసం', 'జ్ఞానాభ్యాసం' చేస్తేనే
దేవకీనందనుడు 'శ్రీకృష్ణభగవానుడు' అయ్యాడు!
ఇక ఆంధ్రరాష్ట్రంలో కూడా 'రామరాజ్యం', 'శ్రీకృష్ణరాజ్యం' వచ్చి తీరాలి!
'ఆత్మజ్ఞానం' కలవారైనా ప్రభుత్వం చేపట్టాలి; లేదా
ప్రభుత్వంలో ఉన్నవారైనా 'ఆత్మజ్ఞానం'ను విధిగా
సమీకరించుకోవాలి, సంపాదించుకోవాలి!
'ధ్యాన భాగ్యం' లేనిదే, 'ఆత్మజ్ఞాన సౌభాగ్యం' లేనిదే, 'ధర్మయుత ప్రభుత్వం'
అన్నది, 'భాగ్యయుత ప్రభుత్వం' అన్నది అసంభవం !
మనమందరం కలిసి 'ఆత్మజ్ఞాన ప్రభుత్వం' కోసం కృషి చేద్దాం!
సోక్రటీస్ కన్న కలలను సార్థకం చేద్దాం!
నూతన ప్రపంచ సృష్టికి నాంది పలుకుదాం!
సత్యయుగాన్ని స్థాపిద్దాం!
సత్యమేవ జయతే! ఆత్మ యేవ జయతే!

# "పండితా సమదర్శినః!"

"పండితా సమదర్శినః!"

ధ్యాన విజయులైన వారు ప్రపంచంలో ఎలా విహరిస్తారు?

ఏ విధంగా అంటే 'అద్భుతమైన సమదర్శనం'తో సంచరిస్తారు!

'సమదర్శనం'లో విహరిస్తారు.

*"విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని*

*శుని చైవ శ్వపాకే చ పండితా సమదర్శినః!"*

అంటే "ఒక బ్రాహ్మణుడు, అంటే ఒక బ్రహ్మజ్ఞాని, అందులోనూ విద్యా వినయ సంపన్నుడైనవాడు.

ప్రపంచంలో అన్ని రకాల మనుష్యులనూ 'సమభావం'తో చూస్తాడు.

వారు ఎంతటి సాధువులైనా, ఎంతటి క్రూరులైనా, ఎంతటి జ్ఞానులు అయినా, ఎంతటి మూర్ఖులైనా!"

పై శ్లోకంలో 'హస్తిని', 'గోవు' అన్న పదాలు సాధుత్వానికీ, జ్ఞానత్వానికీ ప్రతీకలు.

అట్లాగే 'శుని', 'శ్వపాకే' అన్న పదాలు అల్పత్వానికీ, మృగత్వానికీ ప్రతీకలు.

పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ మాస్టర్లు పూర్ణ ధ్యాన విజయులు,

సంపూర్ణ జ్ఞాన సంపన్నులు కనుకనే, వారందరూ 'సర్వత్రా సమదర్శనం'తో సంచరించేవారు; సర్వవేళల్లో 'సమదర్శనం'లో విహరించేవారు.

"ప్రతి మనిషి యొక్క అంతిమ ధ్యేయం సమదర్శిత్వాన్ని సాధించటం"-

అన్న సందేశాన్ని మనకు శ్రీకృష్ణ పరమాత్ముడు అందించాడు.

ఈ సనాతన సందేశాన్ని, సనూతనంగా మనం అందరికీ ఇద్దాం!



# "ఆనాపానసతి"

మనిషి తనను తాను మరిచిపోయాడు.

మనిషి తనను తాను పోగొట్టుకున్నాడు.

మనిషి తనకు తాను శూన్యమైపోయాడు.

ఫలితం ?

పర్యవసానం ?

ఫలితం - దుఃఖం!

పర్యవసానం - అర్థరహితమైన జీవితం!

ఇదీ సగటు మానవుని రీతి, తీరు - ప్రపంచమంతటా

ఇదే తీరు భారతదేశంలోనూ, ఆంధ్రరాష్ట్రంలోనూ,

ఇదే తీరు ప్రతి జిల్లాలోనూ, ప్రతి గ్రామంలోనూ, ప్రతి కుటుంబంలోనూ

ఇలాగే, అన్ని ప్రాంతాల్లోనూ, అన్ని రాష్ట్రాల్లోనూ

అయితే, ఇప్పుడు "పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్" వచ్చాయి; ఆంధ్రరాష్ట్రమంతటా వచ్చాయి; ఇతర రాష్ట్రాలలోనూ, ఇతర దేశాలలోనూ వెలుస్తున్నాయి.

ఇప్పుడు ఎవరిని వారు గుర్తు తెచ్చుకోవచ్చు.

ఎవరికి వారు స్వస్థతను రాబట్టుకోవచ్చు

ఎలా ? ఏ విధంగా ?

'ఎలా ?' అంటే - 'ఆనాపానసతి' ద్వారా.

'ఏ 'విధంగా' అంటే - 'ఆనాపానసతి' ద్వారా

అంతే ! అంతే !! అంతే !!!

పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీల యొక్క ధ్యానుల మూల ఆధ్యాత్మిక సాధనా సిద్ధాంతం 'ఆనాపానసతి' ధ్యాన అభ్యాసం.

ప్రజలందరినీ ధ్యానులుగా, యోగులుగా, ఋషులుగా తీర్చిదిద్దడానికి కంకణం కట్టుకున్నాయి పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్.

'ఆనాపానసతి' ధ్యానాభ్యాసం చేయండి!

అందరి చేతా చేయించండి!

ధ్యాన, జ్ఞాన ప్రచార యజ్ఞాలలో భాగస్వాములు కండి!

ధ్యాన భాగ్యాన్ని పొందండి!

ఆత్మ సామ్రాజ్యాన్ని ఏలండి!

వాయు పుత్రులు కండి!

రామ మిత్రులు కండి!

# "నిర్ణయాలు"

ఎవరి దగ్గరకు వెళ్లినా ఒకటే జవాబు-
"రేపు చూద్దాం"! "రేపు చేద్దాం"!
అదీ ఎంతో సేపు ఆలోచించి అప్పుడు ఇచ్చే జవాబు!
అధముల బ్రతుకులు ఎప్పుడు ఇంతే!

"రేపు" అనేవాడు అధముడు;
"ఇవాళ్టి" అనేవాడు మధ్యముడు;
"ఇప్పుడు" అనేవాడు ఉత్తముడు!
తాను 'ఇప్పుడు' చేసేవాడే కాకుండా అందరిచేతా
'ఇప్పుడే' చేయించేవాడే ఉత్తమోత్తముడు!

'రేపు చేద్దాం !" అని చెప్పడానికి ఆలోచించనక్కరలేదు.
"ఇప్పుడు ఎలా చేద్దాం ?" అని తెలుసుకోవడానికే ఆలోచించాలి.
మనిషి అంటేనే నిర్ణయాలు !
నిర్ణయాలు తీసుకోనిదే మనిషి 'జస్ట్ ఎ మెషీన్'!
ఏ మెషీన్ కూడా స్వయంగా నిర్ణయాలు తీసుకోలేదు.

నిర్ణయాలు ఎప్పుడూ 'వర్తమానం'లోనే తీసుకోబడతాయి!
నిర్ణయాలు తీసుకోవడానికి ఆలోచించాలి.
ఆలోచించడానికి ఇష్టపడనివాడే "రేపు" అంటాడు;
తన ప్రగతి మీద తనకు ఇష్టం లేనివాడే 'రేపు' అంటాడు!

ఎప్పటికప్పుడు 'తెలివి'గా నిర్ణయాలు పోస్ట్‌పోన్ చేయడాన్నే 'తమోగుణం' అంటాం.

సరియైన ఆలోచన లేకుండా తొందరపడి నిర్ణయాలు తీసుకోవడాన్నే 'రజోగుణం' అంటాం.

సశాస్త్రీయంగా ఆలోచిస్తూ నిర్ణయాలను ఎప్పటికప్పుడు తీసుకోవడాన్నే 'సత్త్వగుణం' అంటాం.

ఇక చివరగా, ఎలాంటి నిర్ణయాలు తీసుకున్నా వాటి పర్యవసనాల గురించి ఏ మాత్రం చింతించని వాడిని ఎంచక్కా 'నిర్గుణుడు' అంటాం!

మనిషి "తనను తాను తెలుసుకోవడం" అంటే "తన నిర్ణయాల తీరును గ్రహించడం" అన్నమాట. తనను తాను 'తమోగుణి'గా గానీ 'రజోగుణి'గా గానీ గ్రహిస్తే, గుర్తిస్తే వెంటనే 'సాత్వికు'నిగా మారాలి. ఆ తరువాత 'నిర్గుణి'గా పరిణతి చెందాలి.

పిరమిడ్ ధ్యానులందరూ, పిరమిడ్ మాస్టర్‌లందరూ, ప్రతి క్షణం 'సరియైన నిర్ణయాలు' తీసుకుంటారు.

"రేపు చూద్దాం! రేపు చేద్దాం!" అని ససేమిరా అనరు, అనలేరు!

ఎప్పటికప్పుడు మనం తీసుకున్న ఊపిరి 'ఆఖరి ఊపిరి' కాగలదు!

ఏ నిర్ణయానికి ఆ నిర్ణయమే 'ఆఖరి నిర్ణయం' కాగలదు !

ఆఖరి నిర్ణయమే మరణానంతర జీవితాన్ని నిర్దేశిస్తుంది!

కనుక ....

ఎప్పటికప్పుడు నిర్ణయాలు ఖచ్చితంగా, సశాస్త్రీయంగా ఉండాలి!

ఎప్పటికప్పుడు ఖచ్చితంగా, సశాస్త్రీయంగా నిర్ణయాలు తీసుకునే పిరమిడ్ మాస్టర్‌లందరికి నా "Hearty Congratulations"!



# "పరిపూర్ణ జీవితం"

మానవుడి జీవితం, పరిపూర్ణంగా వుండాలి!

మానవుడి జీవితంలో ఏవో కొన్ని అంశాలు అంటే లాభం లేదు - అన్ని అంశాలూ ఉండాలి!

మానవుడు అన్ని విద్యలూ నేర్వాలి! అన్ని కళలోనూ ముందంజ వేయాలి! జీవితం వెయ్యేళ్ళ పంటగా వుండాలి!

మానవుడు తన కోసం తాను జీవించాలి! మానవుడు తన కుటుంబం కోసం జీవించాలి, మానవుడు తన గ్రామాన్నీ, పట్టణాన్నీ ఉద్ధరించాలి!

ఇదంతా తన్ను తాను భగవంతుడిగా తెలుసుకుంటే చాలా సులభం! ప్రతి మానవుడూ భగవంతుడే! 'అహం బ్రహ్మాస్మి'కదా! ఆ స్ఫూర్తితో మన జీవితాల్ని పరిపూర్ణం చేసుకుందాం - అందరి జీవితాల్నీ పరిపూర్ణం చేద్దాం!



# "మనోశక్తి"

భూమి మీద నడయాడే బీజసదృశ్యమైన 'దేవుడే' ఈ మానవుడు!
అత్యున్నత స్థితికి క్రమక్రమంగా ఎదిగి ఊర్ధ్వలోకాల కెగసిన 'మానవుడే' ఆ దేవుడు!
సప్త శరీరాల శక్తిస్వరూపులే 'ఇద్దరూ'!
సప్తశరీరాలూ సంపూర్తిగా క్రియాశీలకం కాకపోతే 'మానవుడు'!
సప్తశరీరాలూ సంపూర్తిగా క్రియాశీలకం అయితే 'దేవుడు'!
మన సప్తశరీరాలూ సంపూర్తిగా క్రియాశీలకం అయితే మన మనోశక్తి అపరిమితం!
మన సప్తశరీరాలూ సంపూర్తిగా క్రియాశీలకం కాకపోతే మన మనోశక్తి పరిమితం!
పరిమితులున్న దేవుడే ఈ 'మానవుడు'!
పరిమితులు లేని మానవుడే ఆ 'దేవుడు'!
మనపై మనం విధించుకున్న పరిమితుల నుంచి శాశ్వతంగా బయటపడదాం.
కండరాలూ, ఎముకలూ, చర్మమూ, మెదడూ, వీటి కలయికే 'నేను' అనుకుంటే అంతకు మించిన అజ్ఞానమేముంది ?
"నేను ఈ భౌతిక శరీరం కాదు; అత్యద్భుతమైన శక్తి స్వరూపుణ్ణి కాంతి పుంజాన్ని" అనుకుంటే అంతకు మించిన సుజ్ఞాన మేముంది;
మన చైతన్యం నిత్యమైన ఆ విస్తృత సత్యంతో ఏకమైతే అన్నీ అవుతాయి అర్థం.
"అన్నీ అర్థం చేసుకోవడం" అంటే మన మనోశక్తిని ఎన్నో రెట్లు పెంపోందించుకోవడం అన్నమాట!
మనస్సు 'స్వచ్ఛం'గా వుంటే మన మనోశక్తి పెంపొందించబడుతుంది,
అనుభవైక ఆత్మజ్ఞానం అన్నదే స్వచ్ఛమైన ఆలోచనలను ఉద్భవింపజేస్తుంది.
అందుకే మనం కార్యోన్ముఖులమవుదాం . . .
ఉన్నతమైన మానవులుగా ఎదగటానికీ,
ఆత్మజ్ఞాన పరాయణులుగా మారడానికీ,
తద్వారా శక్తివంతమైన ఆలోచనా -తరంగాలుగా
మనోశక్తి కాంతి పుంజాలుగా మారటానికీ . . .!
అప్పుడే మనం "భూమ్మీద నడిచే దేవుళ్ళం"గా అవుతాం.

# "సేవ"

"సేవ" అనే తెలుగు పదం "స" మరి "ఏవ" అనే రెండు సంస్కృత పదాల కలయిక!

'స' అంటే 'అతడు' లేక 'అది'; 'ఏవ' అంటే 'మాత్రమే'

'నేను' అనేది లేకుండా చేసేదంతా 'సేవ' ; 'సేవ చేయడానికి ఉర్రూతలూగేవారు' ముందుగా తమను తాము రూపు మార్చుకోవాలి; తమను తాము 'జీరో' చేసుకోవాలి!

'అహంకారం', మమకారం' అన్నవి ఉన్నంత కాలమూ 'సేవ' అన్నది అసంభవం!

'అహంకార'మంటే 'నేను' అనే స్పృహ - 'మమకార'మంటే 'నాది' అనే స్పృహ!

ఈ రెండు స్పృహలూ అంతరించినప్పడే 'సేవ' అన్నది అంకురిస్తుంది.

'ధ్యాన' మనే జలధిలో శుద్ధమైన తరువాత, 'ఆత్మజ్ఞాన' మనే అగ్నిలో ఆహుతి అయిన తరువాత, అప్పడే 'సేవ' అన్నది సాధ్యమవుతుంది. అంతవరకూ మనం పరులకు చేసేదీ. చేస్తామని అనుకునేదీ వారి నుంచి తిరిగి మనం రకరకాలైనవి రాబట్టుకోవటానికి ఏర్పాటు చేయబడ్డ 'వ్యాపార పెట్టుబడే' తప్ప అది "సేవ" కానేరదు!

జీవితం లో 'వ్యాపార' మున్నంత వరకూ ఆనందముండదు - సుఖదుఃఖాల జంట జాతర ఉంటుందే గానీ!

'సేవ' తోనే అసలైన. సిసలైన ఆనందం ...... ఎడతెగని ఆనందం ప్రారంభ మవుతుంది! అయితే,

జ్ఞానం వల్ల 'నేను', 'నాది' అన్నవి 'అంతరిస్తాయ'ని కాదు - 'అందరిలో భాగం' గా మనం తయారవుతాం!

ఇప్పడు "నలుగురిలో నేనొకడిని" అన్న భావన ఉదయిస్తుంది.

అయితే జ్ఞానసముపార్జనాంతరం 'ఇతరుల పట్ల ఏ ఏ భావనలతో కార్యక్రమాలు చేస్తామో 'మన పట్ల' సైతం అవే భావనలతో కార్యక్రమాలు జరుపుకుంటూంటాం.

'మనపట్ల' మనం ఏ ఏ భావనలతో కార్యక్రమాలు జరుపుకుంటామో 'పరులపట్ల' కూడా అలాంటి భావనలతో కార్యక్రమాలు ఉంటాయన్నమాట! వెరసి, అంతా "ఏకో బ్రహ్మ" అయిందన్నమాట!

అంతా "అద్వైత" మయిందన్నమాట! 'నేను', 'నువ్వు' అనే రెండు మాటలు లేవన్న మాట! రెండు పోయి ఒకటయిందన్నమాట!

ఇక మానవుడే 'మాధవుడు' కాదు - సర్వప్రాణి కోటీ మాధవులే!

సర్వప్రాణి కోటి పట్ల సమాన ఆదరభావాన్ని ఉంచటమే, ఆ "సరిసమాన ఆదర భావన"లోనే సమస్త కార్యకలాపాలూ న్యాయబద్ధంగా, పక్షపాతరహితంగా, సర్వశ్రేయోభిలాషి లా, ప్రజ్ఞాకరుణల సమ్మేళనంతో జరుపుతూండటమే "సేవాతత్పరత" అనిపించుకుంటుంది.

మానవుడి ప్రగతి పథం లో పరమ పదసోపానమే 'సేవ'!



# "జ్ఞానయుగం"

'ధ్యానయుగం' అంటే 'జ్ఞానయుగం' అన్నమాట!

ఎందుకంటే 'ధ్యానం ద్వారానే 'జ్ఞానం' లభిస్తుంది కనుక!

ధ్యానం వినా జ్ఞానం లేదు కనుక!

'జ్ఞానం' అంటే 'ఆత్మజ్ఞానం',

'జ్ఞానం' అంటే 'బ్రహ్మజ్ఞానం';

'ఆత్మజ్ఞానం' అంటే 'నేను శరీరాన్ని కాదు ఆత్మను' అని.

'బ్రహ్మజ్ఞానం' అంటే నేనే అంతా, నేనే అందరం' అని.

ధ్యానయుగమే జ్ఞానయుగానికి నాంది.

ధ్యానయుగం ద్వారానే ఈ భూమండలంలో జ్ఞానయుగం స్థాపింపబడగలదు.

అజ్ఞానం దుఃఖానికి మూలం.

అజ్ఞానం అనారోగ్యానికి మూలం.

అజ్ఞానం యుద్ధాలకు మూలం.

అజ్ఞానం వృద్ధాప్యానికి మూలం.

అజ్ఞానం అకాల మరణానికి మూలం.

ధ్యానాన్ని స్థాపిద్దాం , అజ్ఞానాన్ని వధిద్దాం.



# "బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా!"

'ప్రకృతి' అన్నది శాశ్వతాశ్వతాల అద్భుత కలయిక! ప్రకృతి లోని శాశ్వతత్వమే పురుషుడు! ప్రకృతి లోని అశాశ్వతత్వమే నామ రూపాలు!

సదా శాశ్వతమైన పదార్థమే ఆత్మ!!

అశాశ్వతమైన పదార్థమే అనాత్మ!!

అనాత్మ అన్నది స్థూల, సూక్ష్మ, కారణ ప్రకృతుల సమూహం!

జనన - మరణ చక్రం వున్నంత కాలం మాత్రం ప్రకృతి శాశ్వతం!

'ముక్తి' లభిస్తూనే కారణ శరీరం కూడా హుళక్కి!

భౌతికకాయంలో వున్నంత సేపూ మరి, చనిపోయిన తర్వాత, ఈ రెంటి పరిస్థితుల లోనూ వుండేది సూక్ష్మశరీరం అంతవరకే దాని అస్తికత!

సూక్ష్మ శరీర మరణ సమయం ఆసన్నమవగానే సూక్ష్మశరీరం హుళక్కి!

ఇక పోతే స్థూలశరీరం - స్థూలశరీరం వున్నంత సేపే స్థూల శరీరం యొక్క అస్తికత!

మరణం సంభవిస్తూనే అది హుళక్కి!

ఇకపోతే స్థూల శరీరంలో వున్న అవస్థలు : గర్భంలో అండంగా మొదలై, పిండం గా రూపుమారి, శిశువు గా అవతరించి, బాల్యంలో ఎగరలాడి, యవ్వనంలో మిరుమిట్లు గొలిపి, ప్రౌఢత్వంలో నిలద్రొక్కుకుని, వృద్ధాప్యం లో జారగిలబడి, మరణ సమయంలో అంతమవుతుంది స్థూల శరీరం.

ఇంకొంచెం సూక్ష్మం గా చూస్తే, స్థూలశరీరం అన్నది కోటానుకోట్ల కణాల సముదాయం! అనుక్షణం కోటానుకోట్ల కణాలు ఒక ప్రక్కన పుడ్తూంటాయి;

మరొక ప్రక్కన మరణిస్తూంటాయి!

ఇప్పుడున్న కణం మరొక మిల్లీమైక్రో సెకనులో వుండకపోవచ్చు!

వున్నదంతా ఎప్పుడూ నిరంతరంగా మారుతూ వుండేదే!

ప్రకృతిలో స్థిరత్వం చూడబోవడమే అజ్ఞానానికి చిహ్నం!

ప్రకృతి యొక్క నిత్యనూతనత్వమే ప్రకృతి యొక్క శోభ, ప్రకృతి యొక్క రమణీయత, ప్రకృతి యొక్క ఆకర్షణ, ప్రకృతి యొక్క రసకందాయం!

కేవలం వెలుపల వున్న నామరూపాలే మహా అశాశ్వతమనీ, పొరలు పొరలుగా లోపలికి పోతున్నకొద్దీ 'సూక్ష్మం' స్థూలం కన్నా ఒకింత ఎక్కువ శాశ్వతమనీ; 'కారణం' సూక్ష్మం కన్నా మరీ ఎక్కువ శాశ్వతమనీ; కానీ అసలైన శాశ్వతమైన పదార్థం ఒక్క ఆత్మేననీ గ్రహించడమే 'జ్ఞానం'!

ప్రకృతి అంతా మాయామయం!

అంటే,

భూత, భవిష్యత్, వర్తమాన కాలాల్లో అసమానంగా వుండేది.

ఆది శంకరాచార్యులు అన్నారు-

*"మాయామయమిద మఖిలం భూత్వా,*

*బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా!"*

అంటే,

"ఈ సర్వ ప్రకృతి అంతా కూడా మాయామయమైనది;

ఈ విషయాన్ని సదా స్ఫురణలో వుంచుకోవడమే బ్రహ్మపదంలో ప్రవేశించడమంటే" అని.

పిరమిడ్ మాస్టర్స్‌కు ఈ విషయం చక్కగా తెలుసు; అందుకే, ఏ మార్పుకూ ఆశ్చర్యపడరు వారు!

"ప్రతిదీ ఒక ప్రక్క నుంచి వస్తూ, ఇంకొక ప్రక్క నుంచి పోతూంది" అని వారికి మా బాగా తెలుసు!

పురుషుడు ఎప్పుడూ ఏదేని ఒక ప్రకృతిలో నివసించేవాడే కనుక, ప్రతి ప్రకృతీ కొద్దిగానో, లేక ఎక్కువ గానో, లేక పూర్తిగానో అశాశ్వతమే కనుక, వున్న ప్రకృతిలో ఒక ప్రక్క ఎంత నిమగ్నులయి వున్నా; మరో ప్రక్క "వస్తే రానీ, వుంటే వుండనీ, పోతే పోనీ" అన్న తత్వాన్ని పూర్తిగా వంటపట్టించుకున్నవారే - పిరమిడ్ మాస్టర్స్!

పిరమిడ్ మాస్టర్లందరికీ " My hearty Congratulations! అతి క్లిష్ట తరమైన దానిని అతి సులభ సాధ్యం చేసేసుకున్నారు పిరమిడ్ మాస్టర్లందరూ!

అందరూ 'బ్రహ్మవేత్త'లయిపోయారు!

అందరూ బ్రహ్మపదాన్ని అధిష్ఠించారు!

# "కర్మ సిద్ధాంతం"

సిద్ధుల యొక్క అత్యంత అవగాహనే 'సిద్ధాంతం'!
నిరంతర సాధన యొక్క అంత్య స్థితే 'సిద్ధత్వం!'

సృష్టిలో మొత్తానికి వున్నది కేవలం ఒక్కగానొక్క సిద్ధాంతమే!
ఆ ఒక్కగానొక్క సిద్ధాంతమే 'కర్మ సిద్ధాంతం!'

"చేసుకున్న వాడికి చేసుకున్నంత మహదేవా !"
"చేసుకోని వాడికి చేసుకోనంత మహదేవా!"

యద్భావం తద్భవతి మహదేవా!
యద్భవతా తద్భావం మహదేవా!

మన భావనలే మన యదార్థాలవుతాయి!
మన యదార్థాల నుంచే మళ్లీ మన భావనలు ఉదయిస్తాయి!



# "సంధ్యా వందనం"

ప్రొద్దున్నే సూర్యోదయానికి వందనం !
సాయంత్రం సూర్యాస్తమయానికి వందనం !
అయితే, సూర్యుడు ఉదయించడు; సూర్యుడు అస్తమించడు !
ఉదయం ... సూర్యుడు కనపడని లోకాల నుంచి కనపడే లోకాలకు వస్తాడు.
సాయంత్రం ... సూర్యుడు కనపడే లోకాల నుంచి కనిపించని లోకాలకు వెళతాడు.
వాస్తవానికి సూర్యుడు కదలడు.
కానీ భూమే కదులుతోంది; మనమే కదులుతున్నాం.

ప్రొద్దున్నే, మనమే, భౌతిక సూర్యుణ్ణి కానని లోకాల నుంచి
సూర్యుణ్ణి కనే లోకాలకు వస్తున్నాం.
ప్రొద్దున్నే, మనమే, సూర్యుణ్ణి కనని దిశల్లో నుంచి సూర్యుణ్ణి కనే
దిశలలోనికి వస్తున్నాం.
కనుక - ప్రాతఃకాలంలో ఆ సూర్యుడికి జోహార్లు కాదు.
మనకు మనమే జోహార్లు చెప్పకోవాలి!
సాయంసంధ్యలో సూర్యుణ్ణి కనే దిశలోంచి
సూర్యుణ్ణి కనని దిశల్లోకి మళ్ళీ మనం మరలుతున్నాం!
'సూర్యుడు' కనుమరుగు కావటం లేదు;
మనమే కనుమరుగు వేపు మళ్ళుతున్నాం !

వాస్తవానికి,
'సూర్యుడు' అంటే 'ఆత్మసూర్యుడు'!
'సూర్యతేజం' అంటే 'ఆత్మతేజం'!
రాత్రి నిద్రపోతున్నప్పడు మనం శరీర తేజం నుంచి ఆత్మ తేజం
వైపు మళ్ళుతున్నాం ;
ప్రొద్దున్న నిద్ర లేచినప్పడు ఆత్మ తేజం నుంచి

శరీరతేజం లోకి ప్రవేశిస్తున్నాం !

ఈ రెండు సమయాలే వాస్తవానికి 'సంధ్యా సమయాలు' !

ఆ సంధ్యా సమయాలలో 'ఎరుక'లో వుండడమే 'సంధ్యావందన' మంటే!

వేకువ సంధ్యా సమయంలో ధ్యానంలో వుండటం మూలాన

ఆత్మతేజం శరీరతేజం లో సజావుగా ప్రవేశిస్తుంది;

అప్పుడు, కేవలం 'దేహం'గా కాక 'దేహాత్మ'గా మనం విరాజిల్లుతాం.

నిద్రపోయే సంధ్యా సమయంలో మనం ధ్యానం చేస్తూ నిద్రపోవటంతో

ఆత్మతేజం అన్నది దేహతేజం నుంచి సజావుగా నిష్క్రమిస్తుంది.

ఆ స్థితిలో ధ్యానం అభ్యాసం చేస్తే

చక్కటి సూక్ష్మశరీర యానాలు జరుగుతాయి;

ఆత్మలోకాలు సువిదితమవుతాయి; ప్రస్ఫుటమవుతాయి!

నిద్రపోయేటప్పుడూ 'శ్వాస మీద ధ్యాస'!

నిద్ర నుంచి లేచేటప్పుడూ 'శ్వాస మీద ధ్యాస'!

రాత్రి ...'శరీర - ఆత్మ సంధ్య వేళలో సంధ్యావందనం.

వేకువ ...'ఆత్మ - శరీర సంధ్య వేళ'లో సంధ్యావందనం.

అను నిత్య సంధ్యావందనం ద్వారానే జీవితంలో జయం !

అను నిత్య సంధ్యావందనం ద్వారానే జీవితంలో విజయం!!



# "పిరమిడాయణం !"

"రామాయణం!"

'రామాయణం' అంటే శ్రీరాముడి కథ !

'శ్రీరాముడి కథ' అంటే ఒక్కటే - పితృ వాక్య పరిపాలన !!!

"పిరమిడాయణం !"

'పిరమిడాయణం' అంటే పిరమిడ్ మాస్టర్ల కథ !!

'పిరమిడ్ మాస్టర్ల కథ' అంటే - సత్యవాక్ పరిసాధన !!!

వాక్కులు మూడు రకాలు !

1. చెడు వాక్కులు 2. మంచి వాక్కులు 3. సత్య వాక్కులు !

పిరమిడ్ మాస్టర్లందరూ సత్యవాక్ పరిసాధకులు !

ఆత్మ అన్నదే సత్యం !

ఆత్మ గురించి మాట్లాడేవే సత్య వాక్కులు !

ఆత్మానుభవం నుంచి వచ్చేవే సత్య వాక్కులు!!

అందరినీ ఆత్మలుగా సంబోధిస్తూ పలికే పలుకులే సత్య వాక్కులు !!!

సత్యం శరణం గచ్ఛామి !

సత్యవాక్యం శరణం గచ్ఛామి!!

సత్యవాక్ అభ్యాసం శరణం గచ్ఛామి !!!



# "సంక్రాంతి"

క్రాంతి అంటే 'జ్ఞాన ప్రకాశం'!

'జ్ఞాన ప్రకాశం' అంటే ఇంగ్లీషులో 'ఎన్‌లైటెన్‌మెంట్' అంటారు.

'సం' అంటే 'కూడుకుని వున్న' అని అర్థం.

వెరసి - 'సంక్రాంతి' అంటే 'జ్ఞాన ప్రకాశంతో కూడుకుని వున్నది' అని అర్థం.

జీవితంలో అనుక్షణం 'సంక్రాంతి' ఉండాలి !

ఒక్క క్షణం కూడానూ, 'క్రాంతి' లేకుండా వుండకూడదు !

ఇదెలా సాధ్యం ? ఒక్కటే మార్గం - దాని పేరు

'ఆనాపానసతి' అభ్యాసం !

'ఆనాపానసతి అభ్యాస'మే - ఏ క్రాంతికారుడి సందేశమైనా !

'ఆనాపానసతి అభ్యాస'మే - ఏ యోగివరేణ్యుడి జీవితమైనా!!



# "పిల్లల పెంపకం"

ప్రపంచంలో మొట్ట మొదటగా అతి కష్టమైనది ఆత్మానుభవం.

తరువాత పిల్లల పెంపకం.

ఉట్టికి ఎగరలేనమ్మ స్వర్గాన్ని కోరుకున్నట్టు తామెవరో తామే తెలియని వాళ్ళు పిల్లలని ఎలా పెంచగలరు?!

తన్ను తాను తెలుసుకున్న తరువాతే నిజానికి పెళ్ళి చేసుకోవాలి; పిల్లల్ని కనిపెంచాలి. ఆత్మజ్ఞానం లేని వాళ్ళు పిల్లల్ని కనవచ్చు. కానీ వాళ్ళని పెంచే అర్హత వారికుండదు! పూర్వం రోజుల్లో గురుకులంలో పిల్లలందరూ పెరిగినట్లు ఈ రోజుల్లో కూడా అలాగే జరగాలి.

ఏ ప్రాణైనా ఒక ప్రాణిని పుట్టించగలదు. అది ప్రాణి యొక్క గొప్పదనం కాదు. అది ప్రకృతి యొక్క మహత్తు. అలాగే మానవుల జననం కూడానూ ప్రకృతి సహజంగానే జరుగుతూ వుంటుంది. అయితే, 'మానవుల పెంపకం' అనేది కేవలం శరీరాల పెంపకం కాదు. మేధా సంపన్నత్వం సమకూరాలి. కనుక, పూర్ణ వికాసులైన మానవుల వల్లనే ఆ పెంపకం సాధ్యం.

మేధస్సు యొక్క పూర్ణ వికాసం అన్నది ఆత్మానుభవం (self realisation) ద్వారానే మొదలవుతుంది. క్రమ క్రమంగా ఆత్మ విజ్ఞానం (spiritual science)లో నిష్ణాతులయినప్పడే అది పరిపూర్ణం అవుతుంది. ఈ సిద్ధాంతాన్నే 2500 సం॥కు పూర్వం సోక్రటీస్ విశేషంగా ప్రవచించాడు. 'పిల్లల పెంపకం' అన్నది ఆయన యొక్క అతి ముఖ్యమైన బోధనాంశం.

హిందూ ధర్మంలో కూడానూ బ్రహ్మచర్యాశ్రమం తరువాతే గృహస్థాశ్రమం ధర్మంగా నిర్వచించబడింది. బ్రహ్మజ్ఞానంలో చరించే వాళ్ళే బ్రహ్మచారులు, శిశుత్వం పోయి బాలత్వం వస్తూనే - నేటి బాలురే రేపటి పౌరులు కనుక - ఆ బాల బాలికలకు 'ఉపనయం' కార్యక్రమం నిర్వహించడమే హిందూధర్మంలో ప్రధానాంశం.

'ఉపనయనం' అంటే, 'మూడవకన్ను (third eye)' దీన్నే E.S.P. (extra sensary perception) అని కూడా అంటాం. దివ్యదృష్టి, దివ్యశ్రవణం, దివ్యయానం మొదలైనవన్నీ దీని క్రిందికే వస్తాయి.

'బ్రహ్మోపదేశం' చేస్తారు. అంటే 'తత్త్వమసి', 'నువ్వే దేవుడు', 'అహం బ్రహ్మాస్మి' నేనే దేవుడు' అన్నది ప్రభోధిస్తారు. అంతే మూడవకన్ను అన్నది ధ్యానాభ్యాసం ద్వారానే అంకురిస్తుంది. 'ధ్యానయోగం' అంటే చిత్తవృద్ధి నిరోధం. ఇది కేవలం 'ఆనాపానసతి' లేక 'శ్వాస మీద ధ్యాస' ద్వారానే సాధ్యం.

కనుక, శిశుత్వం పోయి బాలత్వం వస్తూనే బాల బాలికలందరకూ ప్రప్రథమంగా బ్రహ్మోపదేశం చేసి ధ్యానాభ్యాస తీరుని వారి జీవితంలో ప్రవేశపెడతారు. బాలత్వం ఐదు సం॥లు వుంటుంది. ఏడు సం॥ల వయస్సు తర్వాత బాల బాలికలు యువావస్థలో ప్రవేశిస్తారు. మరో ఏడు సం॥లో పూర్తిగా బ్రహ్మజ్ఞానులై విలసిల్లుతారు. బ్రహ్మచారి బ్రహ్మచారిణులవుతారు. యువావస్థలో ప్రవేశిస్తూనే దేహ ప్రకృతి పరంగా నూతన సృష్టి కార్యక్రమానికి తగిన శక్తి సామర్థ్యాలు వస్తాయి కనుక గృహస్థాశ్రమానికి వెంటనే వెళ్ళవచ్చు. కానీ, యువావస్థ ముగిసే వరకూ అంటే బ్రహ్మజ్ఞానం, పూర్తి కానంత వరకూ గ్రహస్థాశ్రమంలో ప్రవేశించరాదు.

యువత్వ ప్రారంభంలోనే బ్రహ్మోపదేశమూ, ఉపనయన కార్యక్రమాలు జరిగి, బాల వయస్సులో పూర్తిగా ధ్యానభ్యాసమూ, జ్ఞానభ్యాసమూ జరిగి, యవ్వన వయస్సులో ప్రవేశించే తరుణానికి పూర్తి బ్రహ్మచారులై, బ్రహ్మచారిణులై దేహధారుఢ్యంతో పాటు ఆత్మధారుఢ్యం కూడా సంపూర్ణంగా కలిగివుంటారు. అలాంటి వారు వెంటనే గృహస్థాశ్రమం స్వీకరించి నూతన శిశువులను ప్రకృతి ఒడిలోంచి లాగి వారు శిశుత్వంలో వున్నప్పుడు వారి శరీర పోషణ సక్రమంగా చూసుకుంటూ, వారు కూడా యువ వయస్సులోకి రాగానే వారి ఆత్మోన్నతికి కూడా కారణభూతులౌతూ ఈ విధంగా సరియైన పిల్లల పెంపకం జరుగుతుంది.

ఆత్మవిద్య ఉన్నవాళ్ళే, ఆత్మానుభవం ఉన్నవాళ్ళే అనేకానేక లోక విద్యలనూ అతి సులభంగా వశం చేసుకోగలరు. నేర్చుకున్న లోక విద్యలను తమ ప్రౌఢదశల్లో, తమ వృద్ధ దశల్లో లోక కళ్యాణప్రదంగా వినియోగించగలరు.

ఆత్మ విద్యలేని మూర్ఖులు తమ విద్యలను వినాశనం కొరకే వినియోగిస్తారు. ప్రపంచ వ్యాప్తంగా గతంలో జరిగిన దౌర్జన్యాలూ, దోపిడీలూ, మారణహోమాలూ, ప్రస్తుతం జరుగుతున్న దౌర్జన్యాలూ, దోపిడీలూ, మారణహోమాలూ, భవిష్యత్‌లో

జరుగబోయే దౌర్జన్యాలూ, దోపిడీలూ, మారణహోమాలూ ఇవన్నీ కూడా పిల్లల పెంపకం సరిగ్గా లేనందుకే గదా - స్వచ్ఛమైన పిల్లలు స్వార్థపూరితులైన, అస్వచ్ఛమైన పెద్దలుగా మారినందుకే గదా!

ప్రకృతి ఒడిలోంచి వచ్చిన ప్రతి శిశువూ స్వచ్ఛమైనదే, అత్యంత శుద్ధమైనదే. కానీ, మూర్ఖపు తల్లిదండ్రుల చేతిలో, మూర్ఖపు సంఘం యొక్క అజ్ఞాన వాతావరణంలో పెరిగిన శిశువులు తమ తల్లిదండ్రులకు పోలిన, తమ సంఘానికి పోలిన మూర్ఖుల్లానే తామూ తయారవుతారు. "యథారాజా తథా ప్రజా" కదా!

సరియైన పిల్లల పెంపకంలో ఉండే అంశాలు విశ్లేషించుకుందాం.

1) శిశు అవస్థలో ఉన్నప్పుడు సరియైన ఆహారం ఇవ్వాలి; అంటే కేవలం శాకాహారం మాత్రమే అలవాటు చెయ్యాలి.

2) తల్లి ఎప్పుడూ శిశువును వదిలి ఉండరాదు; విధిలేని పరిస్థితుల్లో తప్ప శిశువులు తల్లిదండ్రుల దగ్గరే పెరగాలి.

3) బాల్యావస్థలో ప్రవేశిస్తూనే నూతన బాల బాలికలకు బ్రహ్మ జ్ఞానం ప్రభోధించాలి; వారి చేత ధ్యానాభ్యాసం చేయించాలి; వారి ధ్యానానుభవాలను శ్రద్ధతో గ్రహించాలి.

4) యువావస్థారంభంలో బ్రహ్మజ్ఞానంతో పాటు లోక విద్యలు కూడా ప్రారంభం చెయ్యాలి.

5) బాలబాలికలను బాల బాలికలుగా చూడకూడదు. వారు కూడా ఎన్నో జన్మల నుంచి ఎన్నో అనుభవాలను పొందిన ఎందరో మహాత్ములై వుండవచ్చు - ఉంటారు. ఏ పుట్టలో ఏ పాము ఉన్నదో గదా! కొద్ది మంది బాలబాలికలే ప్రథమ మానవ జన్మలో వుండినవారు ఉంటారు. చిన్న పిల్లలతో వ్యవహరిస్తున్నప్పుడు, పెద్దవాళ్ళతో ఎలా వ్యవహరిస్తామో అలానే వ్యవహరించాలి! వాళ్ళ ఇష్టాయిష్టాలు తెలుసుకోవాలి! మన ఇష్టాయిష్టాలు వాళ్ళపై రుద్దకూడదు!

6) పిల్లలను నిర్భయులుగా చేయడం పెద్దవాళ్ళ ప్రథమ కర్తవ్యం; సర్వ విద్యా పారంగతులుగా సకల కళాకోవిదులుగా చేయడం పూర్ణ ఉద్దేశ్యం.

7) నేటి స్కూళ్ళన్నీ నాటి గురుకులాలుగా తయారవ్వాలి. నాటి గురుకులాలలో 'ధ్యానం', 'ఆత్మజ్ఞానం', గురుసేవ, ప్రథమ స్థానాన్ని ఆక్రమించుకుని ఉండేవి. నేటి స్కూళ్ళల్లో కూడానూ అవన్నీ తిరిగి ప్రథమ స్థానాన్ని ఆక్రమించాలి.

8) పిల్లలు కోకొల్లలుగా ప్రశ్నలు వేస్తూ వుంటారు. ప్రశ్నలకు సరియైన సమాధానాలు తెలిస్తేనే ఇవ్వాలి తమకు తెలియకపోతే తెలిసిన వాళ్ళ దగ్గరకు వాళ్ళను పంపించాలి. అంతేకానీ వాళ్ళ జ్ఞాన పిపాస మీద నీళ్ళు చల్లకూడదు.

9) పిల్లల్లో పోటీ తత్వంతో పాటు, పోటీ లేని తత్వం కూడా సరిసమానంగా వృద్ధి చెందాలి.

10) పిల్లల్ని ఏకాంతంగా అప్పుడప్పుడూ వదిలేయాలి. మానవ జీవితం లేక ఏ ప్రాణి జీవితమైనా ఎప్పుడూ ఏకాంతమే కదా! రాబోయే ప్రచండ ఏకత్వానికి చిన్నప్పుడే బీజం వేయాలి.

11) నిర్ణీత సమయాలలో పిల్లలకు మౌనాన్ని నిర్దేశించాలి. ఈ విధంగా ఎన్నో ఎన్నో మౌలిక సూత్రాలున్నాయి పిల్లల పెంపకం విషయంలో! ప్రకృతి పరంగా వున్న తల్లిదండ్రులు నిజమైన తల్లిదండ్రులుగా మారాలి. ప్రతి తల్లీ - ప్రతి తండ్రీ నిజమైన తల్లీ, నిజమైన తండ్రీగా మారిన రోజు ఈ భువి దివిగా మారిపోతుంది. అంతవరకు అది అసంభవం.



# "మాస్టర్ C.V.V."

**ఎం**తో మంది యోగులు !

ఎంతో మంది మహానుభావులు !

ఎందరో మాస్టర్స్ !

అందరికీ వందనాలు !

మాస్టర్ C.V.V. నమస్కారమ్స్ !

తాను స్వయంగా మాస్టరు అయి ఎంతో మంది మాస్టర్స్‌గా కావడానికి ప్రోత్సహించిన మాస్టర్ - మాస్టర్ C.V.V.!

ప్రతి ఒక్కరూ ఓ మాస్టర్ కావాలి !

అదే అందరి మాస్టర్ల నిజమైన ఆకాంక్ష !

ఓ మాస్టరు ఎలా జీవించాలో తెలుసుకుని మనం కూడా అలాగే జీవించాలి !

మాస్టర్స్ అయిన వారు ప్రపంచం కోసం ఎలా కష్టపడ్డారో గ్రహించి అలా మనం కూడా కష్టపడాలి !

'మాస్టర్ C.V.V. నమస్కారమ్స్' అనే మంత్రం అయినా సరే ...

ఎప్పటికీ ఉపాసన కాదు మార్గం - విపస్సనే శరణ్యం!

యంత్రాలన్నీ మరిచిపోవాలి ...

శ్వాస మీద ధ్యాన అన్నది ఒక్కటే శరణ్యం!

అప్పడే మనం కూడా మాస్టర్స్‌గా అవుతాం!

అప్పడే మనం కూడా ఓ గురువుగా అవుతాం!

# "శ్రీ బాల యోగీశ్వరులు"

ముమ్మిడివరం శ్రీ బాలయోగుల జీవితాలు రెండు మహా అద్భుతాలు!

వారి స్వంత జీవితాల కన్నా యోగసాధన కూ. యోగసిద్ధి కీ, సత్యప్రదర్శన కూ ఇంక ప్రత్యక్ష నిదర్శనాలు ఏవి వుండగలవు ?

ముమ్మిడివరం శ్రీ పెద్ద బాలయోగి నడిచిన బాటలో ఆయన తమ్ముడు నడిచాడు.

తీవ్రాతితీవ్రమైన యోగసాధనార్థం భౌతిక శరీరంతో ఎంతగా 'ఆడుకున్నారు' ఆ ఇరువురూ ! చుట్టు ప్రక్కల వున్న ప్రజలు ఎంతటి మూర్ఖులో, చుట్టప్రక్కల ప్రపంచం ఎంత మూర్ఖమైనదో నోరు విప్పకనే ఎలుగెత్తి చాటి చెప్పారు !

"దేహానికి ఆహారం అవసరం లేదు" అన్నది వారి ప్రధానమైన జీవన సందేశం. ఇంకెక్కడి భౌతిక శాస్త్రం ? ఇంకెక్కడి మెడికల్ సైన్స్ ?

అయినా అలాంటి యోగులకూ గుళ్ళు కట్టి ఆ మానవ విగ్రహాలకూ పూజలు చేస్తున్నారు! అంతే తప్ప, ఆ యోగులతో తాము కూడా సమకాలీన యోగులు కావడానికి ఎవ్వరూ నడుము కట్టడం లేదు! ఎంత విషాదకరమైన విషయం!

శ్రీ పెద్ద బాలయోగి జీవితంలో ఒక్కటే ఒకసారి జ్ఞాన ప్రసంగం చేసారు ! అదే ఆయన 18 సూత్రాల పట్టిక! తెలుసుకోవలసిన సత్యం అంతా ఆ చిన్ని పట్టికలో ఇమిడే వుంది!

పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ మాస్టర్లకు ఆ ఇద్దరు యోగులూ అత్యంత ఆదర్శమూర్తులు!

ఎప్పటికైనా ముమ్మిడివరంలోని ఆశ్రమం దేశంలోని అతిపెద్ద ధ్యానకేంద్రంగా రూపుదిద్దుకోవాలి!

ముమ్మిడివరంలో, ముమ్మిడివరం చుట్టుప్రక్కల గ్రామాల్లో, తూర్పు గోదావరి జిల్లా మొత్తంలో; ఆంధ్రరాష్ట్రం అంతా; యావత్ భారతదేశంలో అందరూ, ప్రతి ఒక్కరూ యోగ మూర్తులు కావాలి !

అదే పై లోకాలలో వున్న ఆ ఇద్దరు దివ్యమూర్తులు పంపే సందేశం!

ఇక ఒక్కమాటలో చెప్పాలంటే -

కళ్ళు తెరుచుకుని వుండడాన్ని ఇక తగ్గిద్దాం. కళ్ళు మూసుకుని వుండడాన్ని మరి హెచ్చిద్దాం! ఎప్పుడూ తింటూ వుండడాన్ని తగ్గిద్దాం, తినకుండా వుండడాన్ని ఒకింత హెచ్చిద్దాం!

శ్వాసాహారిగానే ఎక్కువ పాళ్ళల్లో వుందాం!

శక్తి ఆహారి గానే అధిక శాతం విలసిల్లుదాం!



# "ప్రేయో మార్గం, శ్రేయో మార్గం"

రెండు మార్గాలు ఉన్నాయి.

1) ప్రేయో మార్గం 2) శ్రేయో మార్గం

మన మనస్సుకు నచ్చినది "ప్రేయో మార్గం";

మన బుద్ధికి నచ్చినది "శ్రేయో మార్గం"

ఆత్మజ్ఞానం లేని వారికి బుద్ధి ఉండదు.

ఆత్మానుభవం వున్న వారికి 'మనస్సు' ఉండదు; 'బుద్ధి' ఉంటుంది.

"ఆకలి లేకపోయినా తినవచ్చు. తినాలి" అంటుంది 'మనస్సు';

"ఆకలి ఉన్నప్పుడే తినాలి" అంటుంది 'బుద్ధి'!

అలాగే కామక్రీడల్లో బలాత్కారం చేయమంటుంది 'మనస్సు';

"ఇరు ప్రక్కలా పూర్తి ఇచ్ఛ ఉన్నప్పుడే కామక్రీడ సల్పాలి" అని చెప్పేది 'బుద్ధి'.

'మనస్సు' చెప్పేది 'ప్రేయో మార్గం'.

'బుద్ధి' చెప్పేది 'శ్రేయో మార్గం'.

'మనస్సే' దుఃఖం; 'బుద్ధి' ఆనందం.

'మనస్సే' అసత్యం; 'బుద్ధి' సత్యం.

'మనస్సే' అనారోగ్యం; 'బుద్ధే' ఆరోగ్యం.

'మనస్సే' చంచలం; 'బుద్ధి' - అచంచలం.

'మనస్సే' అశాశ్వతం; 'బుద్ధి' శాశ్వతం.

'మనస్సే' పరిపరివిధాలు; 'బుద్ధి' ఏక విధానం.

ధ్యానం మనస్సును కట్టడి చేస్తుంది.

ధ్యాన విద్యే 'యోగ విద్య'.

ప్రేయో మార్గంలో వుండేవాడే, మనస్సుకు లోబడి ఉండేవాడే 'మానవుడు';

శ్రేయోమార్గంలో ఉండేవాడే, బుద్ధికి లోబడి ఉండేవాడే 'మాధవుడు'!

ప్రతి మనిషి మనస్సు నుండి బుద్ధి దగ్గరకు ప్రమోషన్ తెచ్చుకోవాలి.

ఇది ఒకరిచ్చే ప్రమోషన్ కాదు, ఎవరికి వారే సాధించుకోవాలి.

"నిత్య ధ్యాన సాధన ద్వారా నలభై రోజుల్లో ఈ ప్రమోషన్ వస్తుంది"...

... ఇదే పై లోకాల్లో ఉన్న అందరి బుద్ధుళ్ళ, అందరి బుద్ధి జీవుల సందేశం.

# "మహాయోగిని జిల్లెళ్ళమూడి అమ్మ!"

"నవ్య ఆంధ్రరాష్ట్రపు ఆధ్యాత్మిక మణులలో జిల్లెళ్ళమూడి అమ్మ అగ్రగణ్యులు !

అనేక జన్మల్లో అపారమైన యోగసాధన, ఆధ్యాత్మిక అన్నది వున్నప్పుడే ఆవిడ లాంటి జీవితం సాధ్యం.

అన్నీ తానై - తానే అన్నీ అయి విలసిల్లింది ఆవిడ !

దైనందిక జీవితలో పరిపూర్ణ బ్రహ్మత్వానికి ఆ యోగిని అద్భుత దర్పణం !

"పండితా సమదర్శినః" అన్నది భగవద్గీత - అంటే "అందరినీ సమంగా చూడడమే పాండిత్యం" అని అర్థం !

ఆ విధంగా జిల్లెళ్ళమూడి అమ్మ మహా, మహా, మహా పండితురాలు !

"సమత్వం యోగ ఉచ్యతే" అని కూడా భగవద్గీత అంటోంది - అంటే "సిద్ధి చెందిన వారినీ, సిద్ధి చెందని వారినీ సమంగా చూసేదే యోగం!"

"యోగస్థః కురుకర్మాణి సంగం త్యక్త్వా"అని కూడా భగవద్గీత అంటోంది. అంటే "అన్ని రకాల కర్మలనూ యోగ స్థితిలో వుండే చెయ్యి. దేనికీ అంటుకోకుండా" అని అర్థం.

జిల్లెళ్ళమూడి అమ్మ ఆ విధంగా మహా, మహా, మహా యోగిని ! 1970లో ఆవిడ దర్శనం చేసుకోవడం నాకు జరిగింది.

పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీల మాస్టర్లందరికీ

- ఆవిడ జీవితం ఆదర్శం !
- ఆవిడ జ్ఞానం ఆదర్శం !
- ఆవిడ ఆదర్శం ఆదర్శం !

# "ఇంగిత జ్ఞానం"

మనిషికి ఉన్న సహజ లక్షణం పుట్టుకతో వచ్చినది - పశుత్వం.

పసిపాపగా ఉన్నప్పుడు కేవలం తినడం, తాగడం, పడుకోవడం అలాంటి శుద్ధ శారీరక చర్యలే ఉంటాయి. దీన్నే 'పశుత్వం' అనవచ్చు; లేదా 'పసిత్వం' అనవచ్చు; మానవుడు కనుక 'పశుత్వం' అనం ... 'పసిత్వం' అంటాం.

'పసిత్వం' తర్వాత వచ్చేది 'బాల్యత్వం' ఈ బాల్యత్వంలో మానవుడికి శరీరంతో పాటు ఒక మనస్సు అనే పదార్థం క్రమక్రమంగా నిర్మాణమవుతుంది. ఇది కేవలం 'మనస్సు' అనే దాని కన్న 'మనస్సు - బుద్ధి' అనే రెండు పదార్థాల కలయిక అని చెప్పవచ్చు. దీనినే ఇంగ్లీషులో 'మైండ్' అంటాం.

మానవుడు, తన పరిసరాలను అర్థం చేసుకోడానికి ఈ మైండ్ 'ఉపకరణం'. ఆ బాలుడు పెరిగి పెద్దయిన తర్వాత, తన పొట్ట తానే పోషించడానికి, తన రక్షణ తానే చేసుకోడానికి, సిద్ధపడటంలో సమాజం శిక్షణ యివ్వటానికి ఎంతో ఉబలాట పడుతుంటుంది.

పసిత్వంలో స్వంత పోషణ, స్వంత పరిరక్షణ ఉండదు. బాల్యత్వంలో ఆ స్వంత పోషణా- స్వంత పరిరక్షణా శిక్షణ - యివ్వబడుతుంది. చుట్టుప్రక్కల ఉన్న పరిసరాల అవగాహన కోసం అనేక విద్యలు నేర్పించబడుతూ వుంటాయి. బాల్యావస్థ దాటి యువావస్థ దాటి మొదలవుతుంది మానసిక సంఘర్షణ.

ఈ అజ్ఞానపు ప్రపంచంలో ఉన్న అన్యాయాలకూ, పోటీతత్వానికీ ఆ యవ్వన ప్రపంచమంతా నూటికి 99.9 శాతం బలయిపోతుంది. ఒకవైపు అందరికంటే ప్రథముడు కావాలని తల్లిదండ్రుల నుంచి వత్తిడి, ఇంకోవైపు సమాజంలో తనకన్నా అందరూ అధికులుగా వుండడం, "ముందు నుయ్యి, వెనుక గొయ్యి"లా ఉండే పరిస్థితి -ఫలితంగా - మౌలికమైన ఇంగిత జ్ఞానం మృగ్యమవుతుంది - దాని పర్యవసానం హత్యలూ, ఆత్మహత్యలూ, మానసిక రుగ్మతలూ ఇంకా ఎన్నో, ఎన్నెన్నో -

యవ్వనావస్థలో మౌలికమైన ఇంగితజ్ఞానం కోల్పోయి, ప్రౌఢావస్థలో ఆ ఇంగిత జ్ఞానలేమి అన్నది మరింత బలోపేతమై కుల, మత, వర్గ, జాతి విభేదాలుగా పరాకాష్టనందుకుంటుంది.

"మాది కమ్మ సంఘం", "మాది రెడ్డి సంఘం", "మాది బలిజ సంఘం", "మాది ముస్లిముల సంఘం" ... అని చెప్పడంలో ప్రపంచమంతా సర్వనాశనమవుతోంది!

వాస్తవానికి మౌలికమైన 'ఇంగితజ్ఞానం' ఏమిటి ?

మౌలికమైన ఇంగితజ్ఞానం అన్నది ఏమిటంటే - "కలసి ఉంటే కలదు సుఖం" అనీ, "సమాజాన్ని పోటీతత్వం అనేది వెన్నుపోటు పొడుస్తోంద"ని తెల్సుకుని ఉండటమే "ఇంగితజ్ఞానం".

"ప్రక్క వాళ్ళు బాగుంటే మనం బాగుంటాం" - దీని పేరే ఇంగితజ్ఞానం - "సమాజంలో ప్రతి ఒక్కరూ ఎవరి స్థాయిలో వారు ఎంతయినా అవసరం" - దీని పేరే ఇంగితజ్ఞానం.

"ప్రతి వస్తువుకీ విలువ వుంటుంది; దేనినీ వృథా చేయరాదు" - దీని పేరే ఇంగితజ్ఞానం. "ఏదీ వ్యర్థపదార్థం కాదు" - దీని పేరే ఇంగితజ్ఞానం.

"ఎవరూ సృష్టిలో పనికిరాని వాళ్ళు కారు" - దీని పేరే ఇంగిత జ్ఞానం.

"ప్రతి ప్రాణిలో అంతఃశ్శక్తి అపారంగా వుంటుంది" ఆ అవగాహనే - ఇంగితజ్ఞానం.

"ప్రతి ప్రాణీ ఇంకొక ప్రాణి మీద ఆధారపడుతూంటుంది - ఏ ప్రాణీ తనకు తాను స్వతంత్రం కాదు" అని తెల్సుకోవటమే ఇంగితజ్ఞానం కలిగి ఉండటం.

పెరిగే పిల్లాడికి - పెంచే సమాజం ఎప్పుడూ మౌలికంగా ఇవ్వవలసింది ఇంగితజ్ఞానం - తల్లిదండ్రులు పిల్లలకు ఇంగిత జ్ఞానం కలిగించాలి. తల్లిదండ్రులు బిడ్డలలో ప్రతి రోజూ ఇంగితజ్ఞానాన్ని పరిపోషించాలి. అలాగే పాఠశాలల్లో, కళాశాలల్లో, ఉపాధ్యాయులూ, విద్యార్థులలో మౌలికమైన ఇంగిత జ్ఞానం పట్ల శ్రద్ధ చూపాలి.

పాఠశాలల్లో, కళాశాలల్లో, జంతుశాస్త్రం, భూగోళశాస్త్రం, మరి ఇతర శాస్త్రాల తరహాలో ఇంగితశాస్త్రం అన్నది కూడా విధిగా ఒక పాఠ్యాంశం కావాలి. ఉదాహరణకు - "తెలియకుండా తెలిసినట్లు మాట్లాడ్డం" - ఇంగిత జ్ఞానం యొక్క లేమి.

"వున్న ఆకలి కన్నా ఎక్కువ తినడం" - ఇంగిత జ్ఞాన లేమి.

ఈ విధంగా "ఇంగిత జ్ఞాన శాస్త్ర బోధన" అనేది మౌలికమైన విద్యా విధానం కావాలి.

ధ్యానులు కాని తల్లిదండ్రులకు ఇంగితజ్ఞానం శూన్యం. ధ్యానులు కాని సమాజ పెద్దలలో, పాఠశాల, కళాశాల ఉపాధ్యాయులలో ఇంగిత జ్ఞానం శూన్యంగా వుంటుంది. మనిషిలో క్రోధం, ఆవేశం, ఇవన్నీ ఇంగిత జ్ఞాన లేమి యొక్క విశిష్ట రూపాలు.

ధ్యానశాస్త్రమనేదే మనుష్యులందరిలో ఇంగితజ్ఞానం కలిగిందే ఇంగితశాస్త్రానికి మౌలికమైన శాస్త్రం. ధ్యాన శాస్త్రమంటే ఎప్పుడూ ఆ "మనస్సు - బుద్ధి" అనే పదార్థాన్ని ప్రశాంతంగా వుంచుకునే శాస్త్రం.

ఎక్కడ "మనస్సు - బుద్ధి" అనే పదార్థం ప్రశాంతంగా ఉండదో అక్కడ మనస్సు అతి కోరికలతోనూ, బుద్ధి విపరీత ధోరణులలోనూ, అస్తవ్యస్తమై ఉంటుంది.

ఎక్కడైతే ధ్యానశాస్త్రం ద్వారా - ధ్యాన అభ్యాసం ద్వారా "మనస్సు - బుద్ధి" అనేది ప్రశాంతం చేయబడి ఉంటుందో, అక్కడ మనస్సు సమతుల్యమైన కోరికలతోనూ, బుద్ధి సరియైన విజ్ఞానంతోనూ విరాజిల్లుతూ ఉంటుంది.

ఓ ఆటవిక సమాజం, ఓ నాగరిక సమాజం గా మారాలంటే ఆటవికులు నాగరికులు గా మారాలంటే ఆ ఆటవికత పోయి నాగరికత రావాలి ప్రతి మనిషిలోనూ -

ఇంగిత జ్ఞానలేమి అన్నదే ఆటవికత! ఇంగితజ్ఞాన విశేషమే నాగరికత ! వెరసి ధ్యానశాస్త్రమే ఆటవికులను మౌలికంగా నాగరికులుగా చేసేది.



# పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ - ధ్యానుల

# 18

# ఆదర్శ సూత్రాలు

## 1. సరియైన రీతిలో ధ్యానం చేయడం ; అదే రీతిలో చేయించడం :

"సరైన ధ్యాన రీతి" అంటే "ఆనాపానసతి - విపస్సన" రీతి ! అంటే, ఏ మంత్రమూ ఉచ్ఛరించరాదు; ప్రత్యేకంగా ఏ దేవతా రూపమూ ఊహించరాదు; సుఖాసనంలో కూర్చుని, చేతులు రెండూ కలిపి, కళ్ళు రెండూ మూసుకుని, కేవలం ఉచ్ఛ్వాస నిశ్వాసలనే గమనిస్తూ వుంటే, ఆలోచనలు క్రమక్రమంగా తగ్గుతూ తగ్గుతూ వుంటాయి; మనలో ప్రాణశక్తి క్రమక్రమంగా వృద్ధి అవుతూ వుంటుంది ; క్రమక్రమంగా నాడీ మండల శుద్ధి జరిగి, 'దివ్యచక్షువు' ఉత్తేజితమవుతుంది. కనీసం అరగంట పైగా కదలకుండా, కళ్ళు తెరవకుండా కూర్చోవాలి.

## 2. సరియైన ఆధ్యాత్మిక పుస్తకాలు చదవడం ; అవే పుస్తకాలు అందరిచేతా చదివించడం :

దైవత్వాన్ని సూటిగా చెప్పే పుస్తకాలనే ఎంచుకోవాలి ; వాటినే చదవాలి. 'హిమాలయ యోగులు, 'మిలారెపా జీవిత చరిత్ర' ' ఒక యోగి ఆత్మకథ, 'సంభోగం నుంచి సమాధి', 'తులసీదళం', 'నేను', 'ఆత్మాయణం' మరణం లేని మీరు', 'జొనాథన్ లివింగ్‌స్టన్ సీగల్', 'ధ్యానం శరణం గచ్ఛామి', 'అవిదిత యదార్థం' 'ప్రవక్త', 'ధ్యానంలో నా అంతర్ యాత్రలు', 'బుద్ధ పథం', ' ఆనాపానసతి' అతిషా ప్రజ్ఞావేదం - నక్షత్రమిత్రులు మొదలైన తెలుగులో వున్న పిరమిడ్ పుస్తకాలు తప్పక చదవాలి.

అలానే, ఇంగ్లీషులో వున్న లోబ్‌సాంగ్, రాంపా, రిచార్డ్ బాక్, కార్లోస్, కాస్టానెడా, అన్నీ బీసెంట్, జేన్ రాబర్ట్స్, షెర్లీ మెక్లీన్, రూత్ మాంట్‌గోమరీ, ఖలీల్ గిబ్రాన్, ఇనాయత్ ఖాన్, లెడ్ బీటర్, ఓషో రజనీష్, మైఖేల్ నైమీ, జేమ్స్ రెడ్‌ఫీల్డ్ మొదలైన మహానుభావుల పుస్తకాలు కూడా తప్పక చదివితీరాలి: అందరిచేతా ఇలాంటి పుస్తకాలే చదివించాలి.

## 3. ధ్యానానుభవాలనూ, పుస్తక జ్ఞానాన్నీ పరస్పరం పంచుకోవడం :

స్వంత ధ్యానానుభవాలనూ, అధ్యయనం చేసి పుస్తక అధ్యయనం చేసిన జ్ఞానాన్నీ పరస్పరం పంచుకోవటం వల్ల తక్కువ సమయంలోనే అపార జ్ఞానాన్ని పొందుతాం ! యోగుల, జ్ఞానుల సందేశాలను ఎప్పుడూ ప్రత్యక్షంగా తెలుసుకోవాలి. ఇతరుల అనుభవాలను వినడం ద్వారా మనకు కావలసింది సులభంగా

గ్రహించగలుగుతాం. రోజుకు ఒక గంట అయినా ఈ విధమైన సజ్జన సాంగత్యానికి తప్పక కేటాయించాలి.

కర్నూల్, గుంతకల్, ఉరవకొండ, అనంతపురం, ధర్మవరం, తిరుపతి, నాగులదిన్నె, ప్రొద్దుటూరు, నెల్లూరు, పీలేరు, విజయవాడ, నరసరావుపేట, ఎమ్మిగనూరు, హైదరాబాదు, బళ్ళారి, వైజాగ్, నూజివీడు, శ్రీకాళహస్తి, హిందూపురం, కడప,రాయదుర్గం, హోస్పేట్, బెంగుళూరు, మదనపల్లె,గుంటూరు, రాజమండ్రి, శ్రీకాకుళం, నంద్యాల, ఆదోని, కొల్లాపూర్, ఏలూరు , కాకినాడ, తాడేపల్లిగూడెం, నిడదవోలు, మైసూరు - మొదలైన పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ (ఆధ్యాత్మిక సంస్థల) మాస్టర్ల అనుభవాలు వింటూ వుండాలి.

### 4. పౌర్ణమి ధ్యానం చేయడం, చేయించడం :

పౌర్ణమి రాత్రుల్లో ధ్యానం ఎప్పుడూ మరువకూడదు. ఆ సమయాల్లో ప్రకృతి అత్యంత ఉల్లాసం గానూ, అత్యంత ఆహ్లాదం గానూ వుంటుంది. పౌర్ణమి 'ధ్యానం' వల్ల మరింత ఎక్కువ అనుభవాలు వచ్చి మరింత ఎక్కువ శక్తిని మనం పొందవచ్చును. పౌర్ణమి రోజులు ఇతర లోక మాస్టర్లు ప్రత్యేకంగా భూలోకంలో ధ్యానానికి నిర్దేశించిన రోజులు; అంతేకాక, పౌర్ణమి రోజుల్లో విశ్వశక్తి భూమి మీద విస్తారంగా ప్రసారమవుతూ వుంటుంది.

### 5. పిరమిడ్ శక్తిని ఉపయోగించుకోవడం :

పిరమిడ్ ధ్యాన కేంద్రాలు సమీపంలో వుంటే "పిరమిడ్" లలో ధ్యానం చేయడం ఎంతో లాభకరం ! 'పిరమిడ్ శక్తి' ప్రత్యేకంగా మనలోని చైతన్యాన్నీ, శక్తి స్థాయినీ పెంచుతుంది. పిరమిడ్‌లలో సూక్ష్మశరీర యాత్రలు అతి సులభంగా చేయవచ్చు. 'పిరమిడ్ శక్తి' వల్ల అన్ని రోగాలూ వెంటనే నయమవుతాయి.

### 6. అల్లోపతీ మందులు ఏమాత్రం వాడకుండా వుండటం ; వాటిని సంపూర్ణంగా వ్యతిరేకించడం :

అల్లోపతీ మందులు వల్ల శరీరం తన సహజ వ్యాధి నిరోధక శక్తిని కోల్పోయి, శక్తిహీనంగా తయారవుతుంది. 'మందులు వాడకపోవడమే' అన్నింటికన్నా మంచి 'మందు' ! మన అజ్ఞానం వల్ల శరీరం లోకి మందులు గుప్పించి, మనం మన శరీరాన్ని ఇంకా ఇంకా రోగమయం చేసుకుంటూ అనవసరంగా 'మంచాల పాలు' అవుతున్నాం. భౌతిక శరీరం స్వతఃసిద్ధంగానే అద్భుత శక్తి కలిగి ఉంది. దీన్ని పూర్తిగా గుర్తించడమే అసలైన 'ఆధ్యాత్మికత' అంటే.

**7. మాంసం తినకపోవడం ; దానిని పూర్తిగా వ్యతిరేకించడం :**

శాకాహారం వల్ల తమో, రజో గుణాలు నశించి సాత్త్విక గుణం పెంపొందుతుంది. శారీరక రుగ్మతలన్నింటికీ నిజానికి క్షుద్ర మాంసభక్షణే మూలకారణం. మాంస భక్షులలో హింసాతత్త్వం ఎప్పుడూ పడగవిప్పి వుంటుంది.

**8. వీలయినంత ఎక్కువగా మౌనం పాటించడం :**

'మౌనం' అంటే 'మాట్లాడక పోవడం' ! వీలయినంత 'వాక్ మౌనం' పాటిస్తూ వుంటే, క్రమేపీ అదే మానసిక నిశ్శబ్దానికి సోపానమవుతుంది. మౌనం వల్ల వ్యర్థ ప్రేలాపనలు అంతమయి, మనలోని 'అంతర్వాణి'ని స్పష్టంగా వినగలుగుతాం. మన భావాలను ఎదుటి వారికి క్లుప్తంగా అందించగలుగుతాం. మౌనం ద్వారా ఆదా అయిన అమూల్యమైన కాలాన్నీ, శక్తినీ సద్వినియోగం చేసుకుంటే సకల కళల, సకల విద్యల అభ్యాసం సుసాధ్యమవుతుంది.

**9. పరిమితంగా ఆహారం తీసుకోవడం :**

కడుపుకు సగానికి మాత్రమే ఆహారం తీసుకుని మిగతా భాగాన్ని నీరుకూ, గాలికీ ఎప్పుడూ వదలాలి. తద్వారా శరీరం బరువుగా వుండకుండా తేలికగా వుండి చురుకుగా అన్ని పనులనూ మనం చేసుకోగలుగుతాం.

శరీరపు 'ఆకలికి' భోజనం అన్నది 'మందు' మాత్రమే. ఆకలి తీరుతూనే భోజనం మానేయాలి !

★ *రోజుకు మూడు పూటలు తింటే 'రోగి',*
*రోజుకు రెండు పూటలు తింటే 'భోగి';*
*రోజుకు ఒక పూట తింటే 'యోగి' ;*

★ *రకరకాల రుచులు తప్పక రుచి చూద్దాం; అయితే*
*'రుచి' మాత్రమే జిహ్వకు పెడ్దాం !*

**10. ప్రత్యేక 'ఆధ్యాత్మిక' వేషధారణ అన్నది లేకపోవడం :**

ప్రత్యేక వేషధారణ అనేది మానసిక ప్రవృత్తులను కొద్దిగా ప్రభావితం చేసినా, అది నిజానికి చాలా తాత్కాలికమే. నిజానికి 'కాషాయ వస్త్రాలు' లాంటి ప్రత్యేక వస్త్రాల వల్ల అహంకారం పెరుగుతుంది. వస్త్రధారణ ఎప్పుడూ సర్వసామాన్యంగానే వుండాలి. కాషాయ వస్త్రాలలో 'ప్రత్యేక పవిత్రత' అన్నది ఏమీ ఉండదు.

## 11. చిన్నప్పటి నుంచే పిల్లలకు ఆధ్యాత్మిక ప్రశిక్షణ ఇవ్వడం :

మహాయోగుల జీవిత చరిత్రలను చదివినట్లయితే ఒక విశేషం తప్పనిసరిగా కనబడుతుంది. అదే వారి చిన్నప్పటినుంచే ప్రారంభమయిన ఆధ్యాత్మిక ప్రశిక్షణ ! పిల్లలకు పిన్న వయస్సు నుంచే ఆధ్యాత్మిక శాస్త్రంలో ప్రశిక్షణ ఇవ్వటం అనేది వారి బంగారు భవిష్యత్తుకు రాచబాట అవుతుంది.

పిల్లలు అకలుషితులు. వారి నైజం సర్వదా స్వచ్ఛంగా ఉంటుంది. కాబట్టి చెప్పింది తక్షణమే గ్రహించగల్గుతారు. పిల్లలకు ప్రతి "సిట్టింగ్" లో 15 నిమిషాలు ధ్యానం సరిపోతుంది. వారి అనుభవాలను ఎప్పటికప్పుడు ప్రత్యేక శ్రద్ధతో వింటూ వుంటే వారు ఎంతో ఉత్సాహంగా ఆధ్యాత్మిక రంగంలో ఉరకలేస్తారు.

## 12. 'శిష్యరికం' అనేది లేకుండా - అంతా 'మాస్టర్స్' గా విలసిల్లడం :

సముపార్జించిన ఆత్మజ్ఞానాన్ని ఒకరికొకరు ఎప్పటికప్పుడు పంచుకుంటూ, 'ఎక్కువ-తక్కువ', మరి 'గురు-శిష్య' అనే భేదాలు లేకుండా, అందరూ 'మాస్టర్స్' గానే విలసిల్లడం నేర్చుకోవాలి.

'సీనియర్ - 'జూనియర్' అనే తత్త్వం అలవరచుకుంటూ 'గురు-శిష్య' అనే తత్త్వాన్ని మనలోంచి పూర్తిగా తుడిచివేయాలి.

## 13. ఆధ్యాత్మిక శిక్షణలో 'డబ్బు ఇచ్చి పుచ్చుకోవడాలు' అన్నది ఏమాత్రం లేకపోవడం :

ఆధ్యాత్మిక ప్రశిక్షణా కార్యక్రమంలో డబ్బు తీసుకోవడం, డబ్బు ఇవ్వడం అనేది పూర్తిగా నిషిద్ధం. ప్రాపంచిక వృత్తుల ద్వారా ఎవరి కాళ్ళమీద వాళ్ళు నిలబడుతూ, మిగిలిన సమయాలలో ధ్యాన సాధనా, ధ్యాన ప్రశిక్షణా కార్యక్రమాలలో నిమగ్నం కావాలి.

## 14. విగ్రహారాధన/వ్యక్తిపూజ/వ్యర్థమైన కర్మకాండలు మొదలైనవి చెయ్యకపోవడం; వాటిని సంపూర్ణంగా వ్యతిరేకించడం :

మహాయోగులు చేసింది మనం స్వయంగా ఆచరించడం వల్లనే మనం వారి స్థాయికి ఎదుగుతాం. అంతేకానీ వారి విగ్రహాలను పూజించడం, ఆ వ్యక్తులను స్తుతించడం అనేది మన అమూల్యమైన సమయాన్నీ, శక్తినీ 'బూడిదపాలు' చేయడం మాత్రమే అవుతుంది.

అందుకే, ఆర్యసమాజ స్థాపకులైన స్వామి దయానంద సరస్వతి "మూర్తి పూజ మెట్టు కాదు అగడ్త" అన్నారు.

అలాగే, బుద్ధుడు "అప్పో దీపో భవ" అన్నాడు. మహమ్మద్ ప్రవక్త విగ్రహారాధనను పూర్తిగా నిషేధించాడు.

**15. ఎవరి సమస్యలను వారే, తమ తమ స్వంత ఆత్మశక్తిని వినియోగించి పరిష్కరించు కోవడం :**

సమస్యలు అనేకం వస్తూనే వుంటాయి. అయితే వాటిని పరిష్కరించటానికి "ఎవరో వస్తారు- ఏదో చేస్తారు" అని ఎదురు చూస్తూ కూర్చోవడమనేది మన తమో గుణాన్ని వ్యక్త పరచుకోవడం తప్ప ఇంకేమీ కాదు. స్వశక్తి ద్వారానే మన సమస్యలను ఎప్పటికప్పుడు మనమే పరిష్కరించుకుంటూ వుంటే, సమస్యలు అనే 'సమస్యే' వుండదు. సమస్యలను ప్రతి ఒక్కరూ తమ తమ 'ప్రత్యేక పరీక్ష సమయాలు' గా గుర్తించి, సదా అప్రమత్తంగా వుండటం అలవర్చుకోవాలి.

అసలు అర్థం చేసుకోవలసిన ముఖ్య సూత్రం ఏమిటంటే "మన సమస్యలు ఎప్పుడూ మన 'శక్తి-పరిధి' లోనే వుంటాయి ; అంతేకానీ, దానిని మించి ఎప్పుడూ వుండవు" అని. 'మరొకళ్ళ సహాయం, 'మరొకళ్ళ అవసరం' అనేవి నిజానికి ఎప్పుడూ అవసరం వుండవు.

**16. గృహస్థులుగా సంఘంలో ఉంటూ, ఎవరి పనులను వారు చూసుకుంటూనే, జీవన్ముక్తిని సాధించడం; వర్తమాన జన్మను ఆఖరి జన్మగా చేసుకోవటం :**

"సంసారం దు:ఖసాగరం" అనుకోకుండా "సంసారం ఒక స్వర్గసీమ" అని తెలుసుకుని జీవించాలి; "స్వంత కోరికతో అడుగు పెట్టిన జన్మకారణాన్ని తెలుసుకోడమే" ఆత్మ జ్ఞానాన్ని కలిగి వుండటం అంటే.

జితేంద్రియుడుగా వుంటూ, మధ్యే మార్గాంకితుడై, ఆవేశరహిత, హింసారహిత సత్యస్థిత, సుఖమయ యోగ-సంసారం చేస్తూ, అందరినీ యోగ సంసారోన్ముఖులుగా చేస్తూ వున్న జన్మే ఆఖరి జన్మ.

**17. అన్ని గ్రామాలలోనూ, అన్ని పట్టణాలలోనూ పిరమిడ్ ధ్యాన కేంద్రాలనూ, పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీలనూ విధిగా నెలకొల్పడం :**

'శుభ్రత' అనేది మన ఇంటికే పరిమితం అయితే మనచుట్టూ వున్న అపరిశుభ్రత వల్ల పూర్ణ ఫలితాన్ని మనం పొందలేం. అదే విధంగా, మన వారు,

మన చుట్టుప్రక్కల వున్న వారు కూడా జ్ఞానవంతులుగా వున్నప్పడే మన జ్ఞానం కూడా పూర్తిగా వికసించేది. అందుకే, అన్ని చోట్లా ధ్యాన కేంద్రాలనూ, స్పిరిచ్యువల్ సొసైటీలను విధిగా స్థాపించి తీరాలి.

**18. పిరమిడ్ మాస్టర్లందరూ తమ తమ ధ్యానానుభవాలను గ్రంథరూపం చేసి ప్రచురించడం :**

సర్ ఫ్రాన్సిస్ బేకన్ ఈ విధంగా ఉద్బోధించారు - "writing makes a man perfect" అని. అంటే, "వ్రాత అనేది మనిషిని పూర్ణ పరిపక్వత కలిగే వానిలా చేస్తుంది" అని. కనుక పిరమిడ్ మాస్టర్లందరూ తమ తమ అనుభవాలను విధిగా గ్రంథరూపంగా ప్రచురించాలి; తద్వారా పరిపక్వతను సంతరించుకోవాలి.

ఇదే "ఋషి ఋణం" తీర్చుకోవడం అంటే !



# పుస్తక పఠనం - చదువవలసిన పుస్తకాలు

పుస్తకాలు చదవడం వల్ల మనకు మొత్తం విషయాలన్నీ తెలుస్తాయి. ప్రపంచంలో ఉండే యోగుల జీవిత చరిత్రలను శ్రద్ధగా పఠనం చేస్తే వారి వారి అనుభవాలనూ, వారి వారి బోధనలనూ చక్కగా తెలుసుకోవచ్చును.

మహాయోగుల జీవిత చరిత్రలను చదవడం వల్ల, వారు జీవితాంతం కష్టపడి సాధించిన ఫలితాలను మనం కొన్ని గంటల్లోనే - అన్ని సంవత్సరాలు కష్టపడకుండానే - వారి ఆధ్యాత్మిక సారాంశాల్ని గ్రహించి మన అభివృద్ధికి సోపానాలుగా చేసుకోవచ్చును.

గౌతమబుద్ధుడు ఆరు సంవత్సరాలు ధ్యానం చేసి "దుఃఖానికి కారణం తృష్ణ' ' అనీ, "తృష్ణకి కారణం అవిద్య" అనీ" కనుగొని ప్రపంచానికి చాటి చెప్పాడు. కానీ, మనం ఆరు సంవత్సరాలు కష్టపడకుండా ఒక నిమిషకాలం లోనే దానిని చదివి, "అవిద్యను నాశనం చేస్తే, తృష్ణను వీడితే ఇక దుఃఖం ఉండదు" అని తెలుసుకోవచ్చును.

పుస్తక పఠనం ద్వారా, ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని సంపూర్ణంగా తెలుసుకుని మనలో ఉన్న మూఢ నమ్మకాల్నీ, మూర్ఖత్వాలనూ వదిలించుకుంటే మన పురోగతికి మనమే దారి ఏర్పరచుకున్న వాళ్ళమవుతాం.

ముఖ్యంగా, మానవుడు 'చనిపోవడం' అనే మాటలను తలచుకోడానికే భయపడతాడు! అసలు 'చనిపోవడం' అనేది, రెండు పగళ్ళ మధ్య నిద్రలాగా, రెండు జీవితాల మధ్య విశ్రాంతి. ఎప్పుడైతే ఈ విషయాన్ని తెలుసుకుంటామో ఇంక మనకు 'చనిపోవడం' అంటే భయం పోయి, అది వచ్చినప్పుడు ఆనందంగా స్వీకరిస్తాం! అప్పుడే మనం స్వయంగా, అంటే 'స్వ ఇచ్ఛ' ఎన్నుకుని తీసుకున్న వర్తమాన జీవితాన్ని ఆనందమయంగా వుండేలా చూసుకుంటూ మన పురోభివృద్ధి వైపు పయనించ గలుగుతాం.

పైన చెప్పిన విషయాల లాంటివి అనేకం తెలియాలంటే అవి మనకు యోగులు వ్రాసిన పుస్తకాలలోనే దొరుకుతాయి.

అంచేత, తప్పకుండా చదువవలసిన పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ వారిచే ప్రచురించబడ్డ కొన్ని తెలుగు, ఆంగ్ల పుస్తకాల పట్టికలను ఇక్కడ పొందుపరుస్తున్నాం.

# పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ ప్రచురించిన పుస్తకాలు, ఆడియో క్యాసెట్స్

రచయిత                                                      పుస్తకాలు

## గుంతకల్ పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ

1) కృష్ణ - ధ్యానంలో నా అంతర్ యాత్రలు
2) T. మురళీధర్ - ధాన్యం శరణం గచ్ఛామి
3) T. మురళీధర్ - ధర్మం, శరణం, గచ్ఛామి

## క్యాసెట్

1) ధ్యానం - సుభాష్ పత్రి
2) Meditation - సుభాష్ పత్రి
3) భజగోవిందం - సుభాష్ పత్రి

## కర్నూల్ పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ

1) C. అరుణ - నేను ; Messages from 40 Masters
2) సుభాష్ పత్రి - తులసీదళం
 - బుద్ధా పిరమిడ్ ధ్యాన కేంద్రం
 - Be A master
 - Be A Buddha
3) T. సత్యనారాయణ (సేత్) - అవిదిత యదార్థం
4) I.V. రెడ్డి - రైకీ

## ధర్మవరం పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ

1) యాదాలం శర్వాణి - ఆత్మాయణం
2) K. రజనీకాంత్ (ఖలీల్ గిబ్రాన్) - ప్రవక్త

## ది ఎమ్మిగనూరు పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ

1) P.G. రామ్మోహన్(లోబోసాంగ్ రాంపా) - మరణం లేని మీరు

## ది తిరుపతి పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ

1) డా॥B. మహేంద్రవర్మ (రిచార్డ్ బాక్) - జొనాథన్ లివింగ్‌స్టన్ సీగల్
2) I. నరసింహారెడ్డి - రాంపా స్పీక్స్ ఎగైన్
3) తిరుపతి మాస్టర్స్ - ధ్యాన వందనం

## నాగలదిన్నె పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ

1) యండమూరి వీరేంద్రనాథ్ - జీవితంలో విజయం
2) సుభాష్ పత్రి (సంకలనం) - శ్రీ వసిష్ఠామృతం

## పిరమిడ్ పబ్లికేషన్స్, హైదరాబాద్

1) P.G. రామ్మోహన్ - అతీషా ప్రజ్ఞావేదం
2) P.G. రామ్మోహన్ - నక్షత్ర మిత్రులు
3) P.G. రామ్మోహన్ - రామ్మో

## వైజాగ్ పిరమిడ్ స్పిరిచ్చువల్ సొసైటీ

1) కంప్లీట్ మాన్ - B.V. రమణ
2) ముక్తిమార్గం క్యాసెట్ - సుభాష్ పత్రి

## హైదరబాద్ పిరమిడ్ స్పిరిచ్చువల్ సొసైటీ

1) ధ్యాన మృదంగం క్యాసెట్ - డా॥ యల్లా వెంకటేశ్వరరావు
2) 18 ఆదర్శ సూత్రాలు - సుభాష్ పత్రి

## ధ్యాన లహరి పబ్లికేషన్స్, తిరుపతి

1) సుభాష్ పత్రి - భజగోవిందం
2) సుభాష్ పత్రి - జ్ఞానపథం
3) సుభాష్ పత్రి - ఆనాపానసతి
4) సుభాష్ పత్రి - ధ్యానం
5) Dr. N. సూర్యకుమారి - మిర్దాద్ (మైఖేల్ నైమీ)
6) V. గీతారెడ్డి - ఓషో ఆత్మ పరిమళం ఆధ్యాత్మిక విప్లవం
7) సుభాష్ పత్రి - వాక్ క్షేత్రం
8) సుభాష్ పత్రి - ఆత్మ విజ్ఞానం
9) సుభాష్ పత్రి - ఆరోగ్యమే మహా భాగ్యం !

## కాస్మిక్ ఆడియోస్, తిరుపతి

1) సుభాష్ పత్రి - "ధ్యాన వేణువు" I
2) సుభాష్ పత్రి - "ధ్యాన వేణువు" II

3) సుభాష్ పత్రి - "ఎన్‌లైటెన్‌మెంట్ - అంటే ?"
4) సుభాష్ పత్రి - "Bhajagovindam I
5) సుభాష్ పత్రి - "Bhajagovindam II
6) సుభాష్ పత్రి - "సంభోగం వేరే - సమాధి వేరే"
7) సుభాష్ పత్రి - "పిరమిడ్ పార్టీ"
8) సుభాష్ పత్రి - "ఆత్మ విజ్ఞానం -I"
9) సుభాష్ పత్రి - "వాక్ క్షేత్రం - I
10) సుభాష్ పత్రి - "వాక్ క్షేత్రం - II
11) సుభాస్ పత్రి - "ఎందరో మహానుభావులు"
12) సుభాస్ పత్రి - లేదు మరణం
13) సుభాస్ పత్రి - NO DEATH
14) సుభాస్ పత్రి - Dhyan (Hindi)
15) సుభాస్ పత్రి - Dhyan Venu (Hindi)
16) సుభాష్ పత్రి - "ఆనాపానసతి"
17) సుభాష్ పత్రి - ఆరోగ్యమే మహాభాగ్యం
18) డా॥ నూకల చిన సత్యనారాయణ - నాద ధ్యానం
19) డా॥ ప్రసాదరాయ కులపతి - ధ్యానయోగం
20) సుభాష్ పత్రి - నానాటి బ్రతుకు
21) సుభాష్ పత్రి - ధ్యానానుభవాలు
22) సుభాష్ పత్రి - జీసస్ క్రైస్ట్
23) సుభాష్ పత్రి - యోగ పరంపర
24) సుభాష్ పత్రి - పిరమిడ్ జ్ఞాన నవరత్నాలు

# ఆంధ్రప్రదేశ్, మరి ఇతర రాష్ట్రాలలో పిరమిడ్ ధ్యానకేంద్రాలు

**సుభాష్ పత్రి**
బుద్ధా పిరమిడ్ ధ్యాన కేంద్రం
రఘునాథ్ థియేటర్ వద్ద,
కల్లూరు, కర్నూలు
ఫోన్ : (08518) 31318

**G. వెంకటేష్**
అగ్రికల్చర్ ఆఫీసర్, లోబ్ సాంగ్
రాంపా పిరమిడ్ ధ్యాన కేంద్రం,
ఉరవకొండ, అనంతపురం జిల్లా
ఫోన్ : (08496) 57459

**మిట్టా లక్ష్మీనారాయణ**
ది ధర్మవరం స్పిరిచ్యువల్ సొసైటీ
పబ్లిక్ లైబ్రరీ ఎదురుగా
ధర్మవరం ఫోన్ : (08559) 20150

**T. విజయకుమార్.**
పిరమిడ్ ధ్యాన కేంద్రం
దుర్గాభవన్ ఎదురుగా,
సుభాష్ రోడ్డు, అనంతపురం
ఫోన్ : (08554) 40389

**K. విజయకుమార్**
ది గుంతకల్ స్పిరిచ్యువల్ సొసైటీ
17 – 726 రామయ్య కాంపౌండ్ ఎదురుగా
తిలక్‌నగర్ గుంతకల్.
ఫోన్ : (08552) 26090

**P.V. రెడ్డినాయుడు**
31 - 32 - 95, అడ్వకేట్,
అల్లీపురం
రాజస్థాన్ హోటల్ ఎదురుగా,
దాబా గార్డెన్స్, విశాఖపట్టణం.
ఫోన్ : (0891) 565664

కంచి రఘురాం
ప్రెసిడెంట్,
ది తిరుపతి స్పిరిచ్యువల్ సొసైటీ
83, కోలా వీధి, తిరుపతి - 517501
ఫోన్ : (08574) 29283

**P.V. శ్రీనివాస మూర్తి**
మండీ మర్చంట్స్
వైశ్యా బ్యాంకు ఎదురుగా, హిందూపురం
ఫోన్ : (08556) 21078

**M. ఆనందరావు**
లెక్చరర్, 24 – 115/2
శాంతినగర్, నెల్లూరు - 524 004
ఫోన్ : (0861) 333619.

**K. రవిచంద్ర**
ది రాయదుర్గం స్పిరిచ్యువల్ సొసైటీ
8/2/175, మేడపైన
తహసీల్దార్ రోడ్డు రాయదుర్గం
ఫోన్స్ : (08495) 62929, 62012

K.M. ఆనందమూర్తి
ప్రెసిడెంట్,
చిత్తూరు, ఫోన్ : (08572) 28455

J. రాఘవరావు
"పిరమిడ్ హౌస్"
కనకదుర్గా పిరమిడ్ ధ్యాన కేంద్రం
ఆంధ్రాబ్యాంక్ ఎదురుగా, మాచవరం,
విజయవాడ. ఫోన్ : (0866) 430334

డా॥ నూకల చిన్న సత్యనారాయణ
ప్రెసిడెంట్,
పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ, హైదరాబాద్,
6 - 1 - 349 పద్మారావు నగర్,
హైదరాబాద్, ఫోన్ : (040) 7534061

డా॥. K. న్యూటన్
12 – 2 – 37/170
శ్రీరామ్‌నగర్ కాలనీ,
మెహిదీపట్నం, హైదరాబాద్.
ఫోన్ : (040) 3535079
సెల్ : 98480 19022

M.P. సుబ్బారాయుడు
గౌతమ బుద్ధా ధ్యాన కేంద్రం
నాగులకుంట, శ్రీకాళహస్తి.

B. యోగానంద
శ్రీ కృష్ణా పిరమిడ్ ధ్యాన కేంద్రం
బలిజపల్లి, వయా సదుం,
చిత్తూరు జిల్లా.

K.P. వీరన్న శెట్టి
ది ఎమ్మిగనూరు స్పిరిచ్యువల్ సొసైటీ,
డోర్ నెం. 167.
కాలనీ, మూడవ లేన్,
K.P.S.S. నివాస్.
ఎమ్మిగనూరు , కర్నూలు జిల్లా.
ఫోన్స్ : (08512) 55262,55108,
55442.

T. హరి
విద్యారణ్య స్పిరిచ్యువల్ సొసైటీ
గోవింద్ బ్రదర్స్
బజార్ వీధి, హొస్పేట్
కర్ణాటక , ఫోన్ : (08394)29613

B. ముఖర్జీ
ది విజయవాడ స్పిరిచ్యువల్ సొసైటీ
ఓం ఆర్ట్ ప్రింట్, బీసెంట్ రోడ్,
J.D. హాస్పిటల్ రోడ్, విజయవాడ
ఫోన్ : (0866) 577684

P. రామకృష్ణ
అడ్వకేట్
స్టేషన్ తోట, నూజివీడు.
ఫోన్స్ : (08656) 33024,
842242.

A. పూర్ణచంద్రరావు
రవి మెడికల్స్ బుచ్చిరెడ్డి పాళెం,
నెల్లూరు జిల్లా.
ఫోన్ : (08622) 73218

శ్రేయన్స్ డాగా
బేతుల్ ఆయిల్ ప్రై. లి.
ఫోన్స్ : (O) 30971,30382
(R) 30051, 22551
ముంబాయి : 09820 182607

B. వెంకటేశ్వరరావు
6-2-53 B
జిమ్మి బండ
ఖమ్మం.
ఫోన్ : (08742) 27309.

శైలేంద్ర జైన్
21, సౌత్ అవెన్యూ
చేబే కాలనీ, రాయపూర్ - 1
ఫోన్స్ : 536382, 535970

T.G. పాండు రంగయ్య శెట్టి
చీఫ్ పాట్రన్
ఆదోని స్పిరిచ్యువల్ సొసైటీ
17/4, భాగ్యలక్ష్మి
వెజిటబుల్ ఆయిల్ ప్రొడక్ట్స్
బసవపురం రోడ్డు ఆదోని - 518 301
ఫోన్స్ : (08512) 52606,
52770, 51303, 51304.

G.N. గుప్త
P.S.N. డిష్ అడ్వర్‌టైజింగ్ ఎదురుగా
T.B. రోడ్డు, ఆళ్ళగడ్డ - 518 453
ఫోన్ : (08519) 20585

ఎర్రిస్వామి
2049 దేవరాజ నగర్
దొడ్డబళ్ళా పూర్ పోస్ట్, కర్నాటక - 561 203.
ఫోన్ : (08119) 23265

Y. దశరధ గుప్త
చీఫ్ పాట్రన్, ది మహబూబ్ నగర్,
పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ
పోలీస్ క్వార్టర్స్ ఎదురుగా,
మహబూబ్ నగర్.
ఫోన్స్ : (08542) 42275, 42895

B. ప్రకాష్‌రావు
19-4-57,
ప్రకాష్‌రావు నాయుడు వీధి,
గవరపాలెం, అనకాపల్లి - 531 002.
ఫోన్స్ : (08924) 24986 (O) 24986
22176 (R)

K.L.N. రావు
75/99 – 1, జయనగర్ కాలనీ
కడప - 516 002.
ఫోన్: (08562) 46712, ఫాక్స్: 40774

M. ఈశ్వరరావు
L.I.G. 88, A.P.H.B కాలనీ,
ఏలూరు - 534 007
పోన్ : (08812) 33527

B. శ్రీరాములు
మెయిన్ బజార్, న్యామద్దాల,
C.K. పల్లి మండలం - 515 101.
అనంతపురం జిల్లా.

G. రాజకుమారి
W/o. సాంబశివరావు
11/106, వరలవీధి, ఏలూరు రోడ్డు,
గుడివాడ - 521 301
ఫోన్ : (08674) 44916

Dr. V. సత్యనారాయణ మూర్తి
శ్రీ వెంకట సత్యసాయి హాస్పిటల్
కృష్ణానగర్, జగిత్యాల - 503 327
ఫోన్స్:(08724) 24130, (O) 23790

అడప కోటేశ్వరరావు
8th Lane,A.T అగ్రహారం,
గుంటూరు - 522 001.

Dr. M.P. ముని రెడ్డి
ఆయుర్వేద డాక్టర్
తాడిపత్రి రోడ్డు,
జమ్మలమడుగు - 516 434.
ఫోన్ : (08560) 70193

V.V. చంద్ర శేఖర్
C/o. B. V. రామకృష్ణారావు
7 - 158 - 25, శ్రీ నిలయం
రవిపాడు రోడ్డు, కాకతీయ నగర్,
నర్సారావు పేట - 522 601
ఫోన్ : (08647) 23962.

P.N. చంద్రశేఖర్
205, జ్ఞాన మార్గ, సిద్ధార్థ లే అవుట్,
మైసూర్ - 517 011,
ఫోన్ : (0821) 570772

K. కృష్ణ గోపాల్
42, వివేకానందరోడ్
రామ్‌నగర్, కోయంబత్తూరు - 641 012
ఫోన్స్ : (0422), 448995, 234696

G. విజయకుమార్
C/o. గండికోట,
రామయ్య శెట్టి, సెక్రటరీ,
పలమనేరు స్పిరిచ్యువల్ సొసైటీ
బజారువీధి, పలమనేరు - 517 408
ఫోన్ : (085792) 52245

N. ప్రసాదరావు
C/o. NIT-CITE కంప్యూటర్స్
మేనేజింగ్ డైరెక్టర్, రెళ్ళవీధి,
శ్రీకాకుళం పోస్టు - 532 001.
ఫోన్ : (08942) 52245

CH. తిలక్
పాలశీతల కేంద్రం
వీరంకిలాకు, కృష్ణాజిల్లా, ఫోన్ : 82234

D. సుధాకర్ రెడ్డి
స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా
పత్తికొండ పోస్ట్ - 518 380.
కర్నూలు జిల్లా. ఆంప్ర. ఫోన్ : (08520) 76291

K. విజయ్ మోహన్
4-2-359, N. కొత్తూరు
వరంగల్
ఫోన్ : (08712) 450018

M. మల్లికార్జున
IInd Cross , I st Main
Ist లింక్ రోడ్, బసవేశ్వర్ నగర్,
బళ్ళారి, కర్నాటక
ఫోన్స్ : (08932)
55208 (R) 50072 (O)

M.S.R. రాంప్రసాద్
మెయిన్ బజార్,
ఎల్లనూరు - 515 465
అనంతపురం జిల్లా
ఫోన్స్ : 79108 (O), 79137 (R)

D. శివప్రసాద్
ధ్యాన లహరి, చీఫ్ కరస్పాండెంట్
పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్, ఇండియా
525, రెడ్డి & రెడ్డి కాలనీ, తిరుపతి
సెల్ : 9848152629.

శ్రేయన్స్ డాగా
810, మాకర్ ఛాంబర్ – V,
నారీమన్ పాయింట్,
ముంబాయి - 400 021,
ఫోన్ : (022) 2828936/37
Fax : 2828935
Cell : 98201 82607

R. శాంతకుమారి
సెక్రటరీ, 36/1, L.B.S. రోడ్డు,
పీలేరు - 517 214,
ఫోన్ : (08584) 44543

శివ ప్రసాద్
ది తాడిపత్రి స్పిరిచ్యువల్ సొసైటీ
15/38, APSRTC
బస్టాండు ఎదురుగా, తాడిపత్రి
అనంతపురం జిల్లా.
ఫోన్స్ : (08558) 73234,
74353, 73847

V.S. రమేష్
Asst. మేనేజర్,
B - 16, నవనగర్,
పాల్వంచ - 507 115. ఖమ్మం జిల్లా.

హరనాథ్
కృష్ణా పిరమిడ్ ధ్యాన కేంద్రం
25/657 , శ్రీనివాస నగర్,
వాటర్ ట్యాంకు ఎదురుగా
నంద్యాల - 518 501, కర్నూలు జిల్లా
ఫోన్ : (08514) 43640

S. K. రాజన్ A.G.M.
నేషనల్ బ్యాంక్ ఆఫ్ అగ్రికల్చర్
& రూరల్ డెవలప్‌మెంట్
42-A, కొన్‌గునగర్, Ist Street,
ఈ రోడ్ - 638 004, తమిళనాడు.
ఫోన్ : (0424) 267224

B. రామ జోగేశ్వరరావు
మాస్టర్ శివ పిరమిడ్ ధ్యాన కేంద్రం
54-19-23, L.I.C. కాలనీ,
మండేలా పార్కు రోడ్,
విజయవాడ. ఫోన్ : (0866) 470 418

M.V.S. నరసింహారావు
170/1, II nd బ్లాక్
జయానగర్, 7 thక్రాస్, 7th మెయిన్,
బెంగుళూరు.
ఫోన్ : (080) 6563976

B.V. ప్రతాప్ రెడ్డి
S.P. సూపర్ స్టోర్స్
పోలీస్ వెల్ఫేర్ కాంప్లెక్స్ , అనంతపురం
ఫోన్ : (08554) 41279
Cell : 98480 79279

M. రెడ్డి సుధాకర్
67/4, బజార్ వీధి,
వాయల్పాడు,
చిత్తూరు జిల్లా
ఫోన్ : (08586) 72389

S. రఘునాధరావు
74-8-15, ప్రకాష్ నగర్,
రాజమండ్రి ఫోన్ : (0883) 468098

G. రామ సుబ్బారెడ్డి
5/5/18, N.G.O. కాలనీ,
కడప, ఫోన్ : (08562) 52060

A.V. సాయికుమార్ రెడ్డి
587-E,
బాలాజీ కాలనీ,
తిరుపతి.
సెల్ : 9849096111

M. శివప్రసాద్
Plot No. 303,
సాయి శ్రీనివాస టవర్స్,
శ్రీపురి కాలనీ, కార్ఖానా, సికింద్రాబాద్ - 15.
ఫోన్స్ : (040) 7747770, 7747586

J. స్వర్ణలత
VIII - 219,
నెహ్రూ బజార్,
పంచరత్న బిల్డింగ్స్,
మదనపల్లి. ఫోన్ : (08571) 62010

షాలినీ బాలాజీ
101, సూర్యా ఎన్క్లేవ్,
తిరుమలగిరి,
సికింద్రాబాద్ - 15.
ఫోన్ : (040) 7794031

T. మురళీధర్
2/73, ఆల్వాల్, సికింద్రాబాద్.
ఫోన్ : (040), 7861172

K.V. రాంప్రసాద్
జనతా ఆప్టికల్స్
కాటూరు రోడ్డు,
ఉయ్యూరు.
కృష్ణాజిల్లా.
ఫోన్ : (08676) 32569

M. కోటేశ్వరరావు
4 – 6 – 58/2
గుంటూరు మేస్త్రి బజార్
సత్తెనపల్లి - 522 403
గుంటూరు జిల్లా.
ఫోన్ : 08641 - 33399

ఆకుల త్రిమూర్తి
రోడ్ నెం. 4, మహాలక్ష్మీ నగర్
తాడేపల్లి గూడెం - 534 104
ప.గో. జిల్లా,
ఫోన్ : 08818 - 22934

V. S. K. నాగార్జున రావు
1వ వీధి, గాంధీనగర్,
నిడదవోలు - 534 301
ప॥ గో॥ జిల్లా.
ఫోన్ : 08813 - 23485

p. శ్రీరాములు
వివేకానంద పిరమిడ్ ధ్యానకేంద్రం
L.I.C. ఏజంట్
నంబులపూల కుంట
కదిరి తాలూకా
అనంతపురం జిల్లా
ఫోన్ : 08494 - 59539

వేమన పిరమిడ్ ధ్యాన కేంద్రం
తూర్పు నడింపల్లి
N.P. కుంట మండలం
అనంతపురం జిల్లా

G.V. సుధాకర రెడ్డి
LIC డెవలప్‌మెంట్ ఆఫీసర్
కదిరి , అనంతపురం జిల్లా
ఫోన్స్ : 08494 - 24330.

శ్రీమతి K. ఉమాదేవి
9 – 11 – 136,
గాంధీబొమ్మ దగ్గర, గాంధీనగర్
కాకినాడ, ఫోన్ : 0884 - 372470

గోళ్ళ ద్రోణపూర్ణచంద్రరావు
శ్రీ గోపాలకృష్ణ క్లాత్ షోరూమ్
మెయిన్‌రోడ్
చల్లపల్లి - 521 126,
కృష్ణాజిల్లా
ఫోన్ : 0867 - 22232

J. పూర్ణచంద్రరావు,
శ్రీ వశిష్ఠ పిరమిడ్ ధ్యాన కేంద్రం
తోట్లవల్లూరు పోస్టు
వుయ్యూరు మండలం.
కృష్ణాజిల్లా, ఫోన్ : 804256.

**A. నర్సింహులు**
శ్రీ హనుమాన్ పిరమిడ్ ధ్యాన కేంద్రం
మచ్చుపల్లి రోడ్, శంకరపురం, కడప.
ఫోన్ : (08562) 46547.

**అనిల్**
D-75, అరవల్లి
I.I.T. న్యూఢిల్లీ
ఫోన్ : (011) 6596664

**అరుణ K. మిట్టపల్లి**
10529, రోథిన్ బర్గ్‌రోడ్
ఉడ్‌బ్రిడ్జి , ఇలినాయిస్ - 60517
(IlliNois)
U.S.A.
ఫోన్ : 6307830054.

**CH. జగదీశ్వరీ నాయుడు**
ప్రిన్సిపాల్, తేజ పబ్లిక్ స్కూల్
కొత్తవలస, విజయనగరం జిల్లా
ఫోన్ :(08966) 71577

**Dr. G.K. సహదేవన్**
లోటస్ అపోలో హాస్పిటల్
పోందురై మెయిన్‌రోడ్
ఈ రోడ్
ఫోన్ : (0424) 282828

**Dr. G.R. యుగంధర్**
గోదావరి ఖని, కరీంనగర్ జిల్లా
Mobile :9848134693

**G. మనోరమ**
మల్లేశ్వర నిలయం , ఓల్డ్ పోస్టాఫీసు రోడ్
అన్నాజిరావు లే-అవుట్ , వినోభానగర్
షిమోగ్గా - 577 204
ఫోన్ : (08182) 49491

**G.N.జోషి**
త్రిమూర్తి మెడికల్ స్టోర్స్
వైశ్యాబ్యాంక్ దగ్గర
ఆర్మూర్ , నిజామాబాద్ జిల్లా
ఫోన్ : (08463) 24148

**G. శేషయ్య**
సహజ హెర్బల్ ప్రొడక్ట్స్
టంగుటూరు, పిరమిడ్ ధ్యానకేంద్రం
మన్నేటికోట, మన్నేటు కోట పోస్టు
చాకిచర్ల , ప్రకాశంజిల్లా
ఫోన్ : (08599) 34035

**హజరత్ రావు**
మేజిస్ట్రేట్ , కోర్ట్ క్యాంపస్
రాజాం , శ్రీకాకుళం జిల్లా
ఫోన్ : (08941) 51178

జయరాములు
ఉషన్న బ్రదర్స్, గద్వాల్ శారీ హౌస్
వేద నగర్, గద్వాల్ ,
మహబూబ్‌నగర్ జిల్లా.
ఫోన్ : (08546) 62028

ది కోడుమూరు పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ
గాయత్రీ ఫిల్లింగ్ స్టేషన్, కోడుమూరు
కర్నూలు జిల్లా
ఫోన్ : (08525) 28429

V. సూర్య ప్రకాష్
శ్రీ వేద వ్యాస పిరమిడ్ ధ్యాన కేంద్రం
పిరమిడ్ నగర్, పులివెందుల రోడ్
వేంపల్లె - 516 329,
కడప జిల్లా , ఫోన్ : 81215

కళా శ్రీనివాస్
శ్రీ వేంకటేశ్వర పిరమిడ్ ధ్యాన కేంద్రం
H.No.1, శాంతినగర్, (హైదర్ ఫాకోట్)
రాజేంద్రనగర్ మండల్
R.R. Dist
సెల్ : 9849036875

D. సుంకిరెడ్డి
బుద్ధా పిరమిడ్ ధ్యానకేంద్రం
కొప్పనూరు - 509 105
కొల్లాపూర్ తాలూక, మహబూబ్‌నగర్ జిల్లా
ఫోన్ : (08501) 76038

G. శివరాం నాయుడు
పిరమిడ్ ఇంజనీర్
S.K. యూనివర్సిటీ క్యాంపస్
అనంతపూర్ , ఫోన్ : (08554) 55349

M. శ్రీమన్నారాయణ
ASM కాలేజీరోడ్
పొన్నూరు , గుంటూరు జిల్లా
ఫోన్ : (08643) 43473

శ్రీ సోమశేఖరరెడ్డి
గార్డెన్ హౌస్, పత్తికొండ, కర్నూలు జిల్లా
ఫోన్ : (08520) 26135

మేడమ్ వాసంతి
B-2, సీమకుర్తి అపార్టుమెంట్స్
వాజపాజులి వారి వీధి , కాకినాడ
ఫోన్ : (0884) 383601

విజయ్‌కుమార్ పాటిల్
14, మహన్‌తేష్ నగర్
జిల్లాం - 16, కర్నాటక,
ఫోన్ : (0831) 453313

Dr. V. రామచంద్రరావు
5-6-[illegible]03, శ్రీ కృష్ణదేవరాయ నగర్
వనస్థలీ[illegible]ం, హైదరాబాద్
ఫోన్ : ([illegible]0) 4240319

